# అసలు జుట్టు ఎలా పెరుగుతుంది?

ఏదైనా అంతే మరి. అలాగే జుట్టుకూడా సరియైన పోషణ ఉన్నప్పుడే పెరుగుతుంది. దురదృష్టవశాత్తు, సంజరుగుతోందంటే, యీ కాలంలో జుట్టుకు వాడే వాటన్నిట కృత్రిమ పదార్థాల కలయిక ఉంటోంది కొద్దోగొప్పో. మరి ఆధునికమైన అలవాట్లలో జుట్టుకి అసలు నూనె రాయక పోవడంతో యీ సమస్య మరింత జటిలమైంది.

**పారాచూట్: మీ అమ్మగారు, వాళ్ళ అమ్మగారూ అందరి యొక్క విలువైన రహస్యం.**

తరతరాల నుంచి జుట్టు పొడుగ్గా, ఒత్తుగా పెరగడం కోసం స్త్రీలు శుద్ధమైన కొబ్బరి నూనె వాడుతూవచ్చారు. ప్రకృతి సిద్ధమైన పోషణ నిచ్చేదిది. చక్కని తలకట్టూ, అందమైన జుట్టును పెంచేదది.



పారాచూట్ మీ అమ్మగారి ఆ విలువైన తలకట్టులోని రహస్యం. కొబ్బరి చెట్టనుంచి కేరళలో ఎండకి ఎండబెట్టిన, చేతులతో దింపి కొబ్బరి బొండాల నుంచి తాజాగా తీసినదది.



**మరింత శుద్ధమైన మరింత తాజా అయిన కొబ్బరి నూనెను గుర్తించడానికి 3 పద్ధతులు.**



ఇది నిజానికి అమ్మగారు అవలంబించిన తెలివైన పద్ధతి. మొదట మీరు చూడవలసింది. అది పారదర్శకంగా ఉందా అని. రెండవది, అది పాతబడి మెతక వాసన వేస్తోందా తాజా వాసన వస్తోందా అని. మూడవది, ఆ నూనెను ఒక చెంచాడు పోసి అది మందంగా, మెతకగా ఉందా, లేక మృదువుగా పారుతుందా అని చూడటం.

**మీ జుట్టుకు కేవలం అత్యంత శుద్ధమైన కొబ్బరి నూనెనే వాడండి.**

మీరు వాడే నూనెకు యీ మూడు పరీక్షలూ చెయ్యండి. మీరు చూసేదేమిటంటే, పారాచూట్ కొబ్బరి నూనె మిగతా నూనెల కన్న మరింత తేట అయినదనీ, మరింతగా తాజా అయినదనీను. దీన్ని క్రమంతప్పకుండా వాడండి, వారాని కొకసారి. దాంతో మీకిక ఒత్తయిన, ఆరోగ్యకరమైన జుట్టు.

## పారచూట్

మరింత తాజాదనంగల కొబ్బరి నూనె-జుట్టుకు ప్రకృతిలోని మంచి లక్షణాల్ని యిస్తుంది.

SILDES BOI/81 TL

## ముఖచిత్రం

"దీపావళి ముచ్చట" ముఖ చిత్రంతో వెలువడిన "ఆంధ్ర సచిత్రవారపత్రిక" చూడ ముచ్చటగా ఉంది.

పి. తారాచంద్రారెడ్డి (కొత్తచెరువు)

*　　*　　*

శ్రీ బాబు గీచిన వ్యంగ్యచిత్రం 'దీపావళిముచ్చట' ఎంతో శోభనిచ్చింది. కొత్త సీరియల్ 'కోరిక తీరేవేళ' యందు ఆనందం, విషాదం, మళ్ళీగత స్మృతులలోకి తీసుకు వెళ్ళడం అన్నీ ఒకే సంచికలో చవి చూపించారు.

వి. బలరామచంద్, సింగం గంగయ్య

[హైదరాబాదు]

*　　*　　*

30—10—81 నాడు ప్రచురించిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని ముఖచిత్రం 'అల్లుడి భయం— అత్తగారి అభయం' చాలా బాగుంది.

వి. భూషయ్య [అబూధాబి. యు. ఏ. ఇ]

కథలు

6—11—81 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రికలో శ్రీమతి భానుమతి రామకృష్ణగారి "అత్తగారు అందాలచీరలు" హాస్య కథ చాల బాగున్నది.

సింతలపల్లి రామలక్ష్మి, భారతీదేవి, ఆమంచి పద్మ జారాణి, శిరీషరాణి　　[గుడూరు]

*　　*　　*

'దీపావళి ముచ్చట' బాబుగారి వ్యంగ్య ముఖ చిత్రంగా వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఆకర్షణీయంగా ఉంది. ప్రముఖ రచయిత్రి, సినీ డైరెక్టర్, డాక్టర్ భానుమతి రామకృష్ణగారి 'అత్తగారు—ఐదు చీరలు' కథ చాలా బాగుంది. భానుమతి గారి కథను చాలా కాలం తర్వాత చదవగలిగాము.

పి. వి. రామనాగరాజు [మధిర]

*　　*　　*

ఈ వారం 6—11—81 పత్రికలో ప్రముఖ సినీ నటి శ్రీమతి భానుమతి రామకృష్ణగారి 'అత్తగారు అందాలచీరలు' కథ మమ్మల్ని ఆకట్టుకుంది. రచయిత్రికి మా ధన్యవాదాలు.

వి. వి రమణాచార్యులు, వి. వి. రమణమూర్తి, టి. పద్మ, బి. వి. రాఘవాచార్యులు [శ్రీకాకుళం]

*　　*　　*




6—11—81 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురించిన 'అత్తగారు—అందాల చీరలు' కథ చాలా బాగుంది. హాస్య రసభరితమైన కథ రచియించిన డాక్టర్ భానుమతి రామకృష్ణగారికి నా హృదయపూర్వక అభినందనములు

ధర్మారావు　　[భువనేశ్వర్]

*　　*　　*

'దీపావళిముచ్చట' ముఖచిత్రంతో వెలువడిన 6.11.81 తేదినాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక ముమ్మెంతగానో అలరింప చేసింది 'అత్తగారు— ఐదు చీరలు' అనుకథ చక్కని కథా గమనముతో నిండిఉండి నన్ను అమితంగా ఆకర్షించింది.

వి. నాగరత్నం. (కొంకీపవలస)

## కార్టూన్లు

30—10—81వ తేదీ దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో కాలానుగుణంగా నేరంతున్న కార్టూన్లు మమ్మల్నెంతో ఆకర్షించాయి. దీపావళి దీపాలతో ప్రతి యింటిని వెలుగులతో నింపినట్లే దీపావళి ప్రత్యేక సంచిక మా హృదయాలను వెలుగులతో నింపింది.

అనంతరాజు అనూరాధ [తణుకు]

## సీరియల్

6—11—81 ఆంధ్రసచిత్ర వారపత్రిక బాగుంది అందులో విప్పకోట సుశీలాదేవిగారి "కోరిక తీరేవేళ" సీరియల్ చాలా బాగుంది

నాజీ గోపాల్‌రెడ్డి [చిత్తూరు]

*　　*　　*

6—11—81 సంచికలో 'జీవితవనంలో కొత్తగాలి' సీరియల్లో ప్రమీల స్కూటర్‌పైనుంచి పడిపోయి ముదురులకు పచ్చని తెలుపురంగు గులాబీలున్న మాక్సీ వేసుకొంది అని వ్రాశారు. కాని చిత్రములో చీర కట్టుకొన్నట్టు వేశారు

పి. హెచ్ ఉషారాణి [కొత్తపేట]

*　　*　　*

6—11—81 నాటి సంచిక బాగుంది విప్పకోట సుశీలాదేవిగారి రచన "కోరిక తీరేవేళ" సీరియల్ ప్రారంభం రసవత్తరంగ సాగింది ఒకే వారంలో ఎన్నో మలుపులతో సస్పెన్స్‌తో ముందుకు పోతోంది. "జీవితవనంలో కొత్తగాలి" సీరియల్ ఆసక్తికరంగా ఉంది.

వై. హేమసుందర్‌రావు [ఒంగోలు]

*　　*　　*

"జీవితవనంలో కొత్తగాలి" సీరియల్లో ప్రమీల మాక్సీవేసుకుంది అని వ్రాశారు. కాని బొమ్మలో మాత్రం చీరకట్టుకున్నట్టుగావేశారు "కోరిక తీరేవేళ" మమ్మల్ని ఆదిలోనే ఎంతగానో ఆకట్టుకుంది.

పి. హెచ్. రమాదేవి [నిడుబ్రోలు]

## సినిమా

6—11—81 ఆంధ్రసచిత్ర వారపత్రిక బాగుంది. దీపావళి జోకులు అందించిన బి వి బి గారికి కృతజ్ఞతలు

శ్యాంసన్ [నారాయణపేట]

## ధర్మపథం

6—11—81 వారపత్రికలో ధర్మపథం శీర్షికను "మతం మార్పిడి" గూర్చిన సమీక్ష ఆసక్తికరంగా ఉంది.

పులవర్తి శ్రీరంగ, రత్నమాల [మొగల్తూరు]

## ఎన్. టి. ఆర్. అభిమానులకు విజ్ఞప్తి!

మేము మా అభిమాన నటులు శ్రీ ఎన్. టి ఆర్. గారిపై త్వరలో ఒక అభినందన సంచికను మరియు, అభిమాన సంఘాల అడ్రస్సుల డైరీని ప్రచురించదలచినాము కావున ఈ అవకాశాన్ని పురస్కరించుకొని ఎన్. టి ఆర్. గారి అభిమానులు మరియు అభిమాన సంఘాల వారు శ్రీ ఎన్ టి ఆర్. గారిపై అభినందన వ్యాసాలను, గేయాలను, వారి విజయపరంపరలను సాధ్యమైనంత త్వరలో క్రింది చిరునామాకి పంపవలసినదిగా కోరుతున్నాము

డా. ఎన్. టి. ఆర్ ఫ్యాన్స్ అసోసియేషన్
బి. పమ్మయ్య, ప్రెసిడెంట్ బుక్‌స్టాల్.
ఎన్. టి పి. సి కాలనీ [పి ఒ] రామగుండం
[కరీంనగర్ జిల్లా]

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకులు
[1938 1972]
ప్రకటనం 4-12-'81
దుందుభి నామ సం. మార్గశిర శు. సప్తమి
**సంపుటము 75 · సంచిక 13**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
✻
సంవత్సరం చందా రు 67-60
ఆరు నెలల చందా రు 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయసూచిక

ముఖచిత్రం :
నటి సుహాసిని
(ఫొటో: ఎస్. రవీందర్)


**కథలు :**

గీతోపదేశం ... 7
గడ్డిపూవు ... 24
నడుస్తున్న చరిత్ర ... 30
చావనుగాక గావను ... 42
విక్రయమైన నీలం ... 55

**సీరియల్ కథలు :**

జీవితవనంలో కొత్తగాలి ... 16
కోరికతీరేవేళ ... 48

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు — 4, లోకంపోకడ — 5
పాలాక్షుని డైరీ—6, గర్భవతం —12,
వారఫలం - 14, డాక్టర్ సలహాలు—22,
ప్రశ్నావళి — 29, సినిమా — 34,
బొమ్మల మహాభారతం — 54,
హైదరాబాద్ హాట్ బుక్— 62,
వంటలు - 64.


## లోకంపోకడ ✻ డూరిమెన్









## చావడానికి హక్కు!

బ్రతుకు — బ్రతకడం అనేది జీవరాశికి భగవంతుడిచ్చిన వరం. ఆ వరమే ఒక్కొక్కప్పుడు దుర్భరమై కూర్చుంటుంది. దీర్ఘవ్యాధులు, భరించలేని రోగాలు, మనిషిని మెలితిప్పే నొప్పులు, బాధలు— వీటితో మనిషి తాను బ్రతకడం కన్న చనిపోవమే మేలని, చావే వో వరమని భావిస్తాడు. ఆరోగి చస్తే పీడావదులుతుందని, తమ ఆర్థిక స్థితి మెరుగు పడుతుందని వూహించే వ్యక్తులూ వుంటారు. ఇటువంటివారు యథేచ్ఛగా చనిపోడానికి క్రీస్తుపూర్వమే గ్రీసు దేశంలో సౌకర్యాలుండేవి. వయస్సువల్ల శక్తి ఉడిగినవారూ, రోగగ్రస్థులూ, జీవితేచ్ఛ సంపూర్ణంగా నశించినవారూ ఒకచోటచేరి భయంకర విషం కలిపిన మధువును ఎంచక్కా సేవించేవారట. ఇది ఆనాడే గాక, ఈనాడూ అవసరం. చనిపోడానికి హక్కు ప్రతి ఒక్కరికి కావాలి. ఢిల్లీలో "ఇండియన్ సొసైటీ ఫర్ ది రైట్ టూ డై" అనే వో సొసైటీ ఉంది. జీవితంమీద రోసినవారూ, దీర్ఘవ్యాధిగ్రస్థులూ, తమ వివరాలతో ఆ సొసైటీకి రాసిన ఆ సొసైటీ వారి శీఘ్ర మరణానికి అవకాశం కల్పిస్తుందట

## హద్దుమీరిన ఓర్పు!

కమిడి అనే గ్రామానికి చెందిన 35 ఏళ్ల పకలామ్ అనే అతను ప్రతిరాత్రి తప్పతాగి, ఇంటికివచ్చి భార్యా పిల్లలను చితుగ్గా చావబాదేవాడట. ఈ బాధ భరించలేని అతని భార్య 28 ఏళ్ల కిట్టు అక్టోబరు 18 వ తేదీ అదే పనిలో ఉన్న తన భర్తను కొతో కత్తితో కస్సున పొడిచి చంపేసిందట.

## హత్యకి దారితీసిన పేచీ!

అరబ్ దేశానికి చెందిన 23 ఏళ్ల అబ్దుల్లా అలూమని అతని స్నేహితులు అలీ అబ్దుల్లా హుస్సేన్ సజాజీ, ఖలీద్ అలెసిసన్ అనే ఇద్దరితో కలిసి 14 వ తేదీరాత్రి బొంబాయి లామింగ్టన్ రోడ్డునగల వేశ్యావాటికలకు ముజ్రా నాట్యంచూడ వెళ్లి, చూసి, అంతా అయ్యాక డబ్బు యిచ్చే విషయంలో పేచీ పెట్టుకున్నాడట. ఆ పేచీ పెద్దదవటంతో అటువంటి వేశ్యలకు అండగా వుండే వారు కలుగ జేసుకోడంతో అబ్దుల్లా అలూమని కత్తిపోట్లకు గురై అక్కడే చనిపోయాడట. మిగతా ఇద్దరూ చిన్నగాయాలతో బయట పడ్డారట.

## అసహనం తెచ్చిన అనర్థం!

జానఫడ్ కు చెందిన తింబవాడిలో వో గృహస్థు తనకూతురు విషయమై భార్యతో చర్చిస్తూ చర్చ శృతి మీరడంతో సహనం కోల్పోయి, తన భార్య తలనరికి, అడ్డొచ్చిన ఇద్దరు కూతుళ్లనూ గాయపరిచి (అక్టోబరు తొమ్మిదిన) తాను వురిపోసుకుని చనిపోయాడట.




## ఆగ్రహంలో అఘాయిత్యం!

కోయంబత్తూరు గోపింగళానికి చెందిన కంజవేలం పట్టిలో వీరన్ అనే వో వ్యవసాయదారుడు పొద్దునే పొలానికి (అక్టోబరు 17 న) వెళ్లి, రాత్రికి రానని భార్యకుచెప్పి, అనుకోకుండా అర్థరాత్రి తిరిగి వచ్చేశారట. భర్త రాడనిధృడంగా నమ్మిన ఆతనిభార్య తన ప్రియునితో వున్నదట. హటాత్తుగా వచ్చిన ప్రియుని భర్తను చూసి ఆ ప్రియుడు పారిపోయాడట. ఆతనిపోలిక దొరకనందువల్ల ఎవడేవాడని అడిగితే ఆమె చెప్పలేదట. ఆ కోపంతో వీరన్ ఆమెనోట్లో చేతులుపెట్టి, నోరుచీల్చి, క్రింది దవుడ పీకేశాడట. ఆమె అక్కడికక్కడే చనిపోయిందట

## అనుమానానికి దారితీసిన అంత్యక్రియలు!

నామక్కల్ కు చెందిన తంగరసు అనే వో లారీ వోనరు భార్య, ముగ్గురు పిల్లలూ నిప్పంటించుకుని చనిపోయారట. కుటుంబ భారం భరించలేక ఆయన భార్య జయలక్ష్మి తనముగ్గురు పిల్లలతో సహా నిప్పంటించుకుని చనిపోతే తంగరసు ఆ విషయం పోలీసులకు తెలియజేయకుండా ఆ శవాలకు దహన సంస్కారాలు చేసేసేడట. దాంతో ఆ జయలక్ష్మి తండ్రి తన కూతురు, మనుమరాండ్రూ హత్యచేయబడి ఉండుంటారని తన అనుమానం అని పోలీసులకు ఫిర్యాదు చేశారట. పోలీసులు తంగరసునుఅరెస్టు చేసి, విచారణ ఆరంభించారట.

## నరపిల్లల్ని బలియిచ్చిన ప్రధానోపాధ్యాయుడు!

నెప్పంతట్టల్ అనే వూరిలో వో స్థలం కొనుక్కున్న తిరుచ్చి కొండపాడికి చెందిన వేలుస్వామి ఆ స్థలంలో ఇల్లు కట్టుకోవాలంటే అది అచ్చి రావాలని, అది అచ్చి రావాలంటే నరబలి ఇవ్వాలని నిర్ణయించుకుని చిత్ర అనే ఆవిడతోను, పళనిముత్తు అనే అతనితోనూ చేరి నాలుగేళ్ల నల్లుసామిని, మూడేళ్ల రాజేంద్రనును తన ఇంటికి పిలిచి కాఫీలో మత్తుమందు కలిపి యిచ్చి, ఆ పిల్లల్ని పిప్పంతట్టల్ తీసుకుపోయి అక్కడ నల్లుసామి కుడికాలూ, కుడి చెయ్యీ నాలిక కళ్లుపీకి నైవేద్యం పెట్టాడట. రాజేంద్ర మత్తు పదార్థం ఎక్కువై చనిపోయాడట. పూజ అయ్యాక ఆ ఇద్దరి పిల్లల శవాల్ని అక్కడే పాతిపెట్టేశారట. ఆ వేలుసామి పంచాయితీ స్కూలు హెడ్మాస్టరట. ఇది జులై ఆరవతేదీ 1980 లో జరిగిందట. చట్టం అప్రూవరుగా మారిన చిత్రను వదిలి మిగిలిన ఇద్దరికి యావజ్జీవ శిక్ష విధించిందట.

## సత్యం మందపాటి



అపాయింమెంట్ ఆర్డర్ చూడగానే ఎగిరి గంతేశాడు అర్జునరావ్

పరిగెత్తుకుంటూ వచ్చి ఒక్క ఉదుటున తండ్రి ముందు వాలాడు – మహానందంతో తన పోస్టింగ్ ఆర్డర్సు చూపించాడు.

ఆయన గంభీరంగా ఆర్డర్ చదివి, అర్జునరావ్‌ని దగ్గరకు తీసుకుని అతనిచేయి ప్రేమగా వత్తి, "ఆల్ ది బెస్ట్ మైసన్ – గో ఎహెడ్ టూ వర్డ్సు ఏస్ ఎక్సెలెంట్ కెరీర్" అన్నాడు.

"రేపే జాయినవుదామనుకుంటున్నాను డాడీ!" అన్నాడు అర్జునరావ్

ఈ వార్త విన్న సావిత్రమ్మ కూడా చాల సంతోషించింది "ఒక సంవత్సరం ఉద్యోగం లేక బలాదూర్‌గా తిరిగినా, నీ అదృష్టం బాగుంది నాయనా ఉన్నఫళాన్నే వుద్యోగం, మంచి జీతం, రేపే చేరు" అన్నది ఆనందంగా.

"డాడ్ కొత్తగా ఉద్యోగంలో చేరుతున్నాను ఉద్యోగంలో ఎంతో వున్నతస్థితికి పోవాలనే ఆశతో, నా జీవితపు నిచ్చెనలో రేపు, మొదటిమెట్టుమీద నుంచోబోతున్నాను – నీ అనుభవాన్ని పురస్కరించుకుని, ఎలా మెలగాలో సలహాయిస్తే తూచా తప్పకుండా పాటిస్తాను" అన్నాడు అర్జునరావ్ వినయంగా

డాడీ అన్నాడు "వెల్ మైసన్ – అలా కూర్చో .. నాకు తోచిన రెండు మాటలు చెబుతాను ..."

అర్జునరావ్ కూర్చున్న తరువాత, ఒక రెండు నిమిషాలు నిశ్శబ్దంగా వుండి డాడీ ప్రారంభించాడు–

"నీకు తెలుసు నేను 28 ఏళ్ళ సర్వీసు చేసి రెండేళ్ళక్రితం రిటయిరయ్యానని – నేను మా ఆఫీస్‌లో నా కొలీగ్స్ వెళ్ళినంత ఎత్తులకు వెళ్ళలేకపోయాను – వాళ్ళు సంపాదించినంత డబ్బు సంపాదించలేకపోయాను– వాళ్ళు జీవిస్తున్నంత వైభవంగా జీవించలేకపోతున్నాను. అయినా నాకా విషయాల్లో ఏమాత్రం బాధలేదు ఎందుకో తెలుసా?" ఆయన ఆగటంచూసి, ఈయనేదో పెద్ద వుపన్యాసం యివ్వబోతున్నాడల్లేవుంది అని అనుకుని, అనవసరంగా అప్పటిదాకా నిలుచుని వున్న సావిత్రమ్మ అక్కడే కుర్చీలో చతికిలబడింది

చతికిలబడి "తెలిస్తే వాడు మిమ్మల్నెందుకు అడుగుతాడు" అన్నది భార్య హోదా చూపిస్తూ.

"అవును – తెలిస్తే అలా ఎందుకు అడుగుతాడు – చెబుతా విను – నేను కొన్ని ఆశయాలకు, నియమాలకు కట్టుబడి పని చేశాను. నీతీ, నిజాయితీ నా లక్ష్యం – రాజకీయం, బానిసత్వం అన్న వాటిని దూరంగా వుంచాను బాస్‌ని బాస్‌గా గౌరవించానేకానీ, ఏ నాడూ నెత్తిన పెట్టుకోటానికి ప్రయత్నం చేయలేదు లంచం, అక్రమ సంపాదన అన్న పదాలు నా డిక్షనరీలోనే లేవు. నిజాన్ని నిర్భయంగా చెప్పేవాడిని ఎక్కడ ఏ లోపంవున్నా ఎత్తి చెప్పేవాడిని ఇలా చేయటంవల్ల కొన్ని ఇబ్బందులు కూడా వచ్చేయి. పైవాళ్ళు మెచ్చేవాళ్ళు కారు కదా కత్తికట్టేవాళ్ళు. శంకరగిరి మాన్యాలు తరచు చూస్తూవుండేవాడిని. చేతికి వస్తున్న డబ్బును వద్దంటున్నందుకు, నన్నో పిచ్చివాడిగా చూసి హేళన చేశారు నా తోటి ఆఫీసర్లు. ఏది ఏమయినా నా ఆశయాల పరిధి దాటి నేను బయటకు వెళ్ళలేదు. నా దేశానికి, నా ప్రజకు నేను అన్యాయం చేయటంలేదన్న ఆత్మతృప్తి, నాకు కొండంత బలాన్నిచ్చేది. నువ్వుకూడా ఎన్ని కష్టాలయినా, నష్టాలయినా భరించి, ఇలాగే మాట మీద, నిజాయితీ మీద నిలబడు..."

# గీతోపదేశం

ఆయన మాటలను మధ్యలోనే తుంచి వేస్తూ అన్నది సావిత్రమ్మ– "ఇలా అయితే వాడు, వాడి కాళ్ళమీద నిలబడలేడు మాటల మూటల మీదే నిలబడితే మీలాగానే నేలమీద చతికిలబడతాడు ఎత్తులకు ఎదగ లేడు మీరు పాడయిపోయిందికాక వాడిని కూడా ఎందుకు పాడుచేస్తారు ఆశయాలూ, అరటికాయలూ అంటూ..."

"నో – నో – నేను ఒప్పుకోను సావిత్రీ మన పిల్లల్ని మంచిదారిలో పెట్టవలసిన బాధ్యత మనది. కష్టమైనా, నష్టమైనా నమ్మిన సిద్ధాంతాల దారిలో నడవటానికి వాడికి బలం యివ్వవలసినవాళ్ళం మనం"

"అటువంటి మాటలు చెప్పకండి – అలా శాస్త్రప్రకారం నడచి మీరు సాధించిందేం లేదు. పైగా మిగతావారిలా జీవితంలో సుఖ పడలేకపోయాం కూడాను యింకా వాడికి కూడా ఎందుకా సుమతీ శతకం పద్యాలు – మళ్లీ అలాటి నీతులు చెప్పారంటే...ఉండండి – వంకాయ కూర మాడిపోతున్నది – ఒరే అర్జూ – రారా నీకో మాట చెబుతాను !" విసవిసా వంటింట్లోకి నడిచింది సావిత్రమ్మ.

అర్జునరావ్ వాళ్ళమ్మ కొంగు పట్టుకుని వంటింట్లోకి వెళ్ళాడు.

"అమ్మ కొంగుపట్టుకుతిరిగే వెధవ, సిద్ధాంతాలమీద ఏం నిలబడతాడు" అనుకుని, సణుక్కున్నాడు డాడీ.

"డాడీ చెప్పినవన్నీ వంటబట్టాయా !" అడిగింది వంట చేస్తున్న సావిత్రమ్మ.

"ఆఁ!" అన్నాడు అర్జునరావ్.

మాడిపోతున్న వంకాయకూరమీద చేతో నీళ్ళు చల్లి ఒక్కసారి 'చుయ్' మనిపించి మూత పెట్టింది సావిత్రమ్మ.

"ఒరే అర్జూ ! మీ నాన్న నీకు చెప్పిన ఆశయాల పాఠాలమీద కూడా యిలా ఒక గుప్పెడు నీళ్ళు చల్లి, మూత పెట్టేయరా. అవి ఈ కాలంలో ఎందుకూ పనికిరావు. ఈ రోజుల్లో ఉద్యోగాల్లో పైకి పోవాలంటే కావలసింది ఆశయాలు కాదు, సిద్ధాంతాలూ కాదు, నీతి నిజాయితీలు అంతకన్నాకాదు..."

"మరింకేమిటి?" అన్నాడు అర్జునరావ్ వంకాయకూర ఘాటు వాసనని గుండెలనిండ పీలుస్తూ.

"అది చెబుదామనే పిలిచాను నీకు అన్న

పెడతాను కూర్చో గబగబా తిని చిక్కడపల్లిలో సుబ్బారావ్ మామయ్యా వాళ్లింటికి వెళ్లు కిష్టిగాడు ఎప్పుడూ ఇంట్లోనే వుంటాడ్నే – పదేళ క్రితం టెక్నికల్ అసిస్టెంటుగా చేరి, ఈనాడు ప్లాంటు మానేజరయాడు వాడు. వాడి ఆశయం, సిద్ధాంతం ఒకటే. నయానాకానీ, భయానా కానీ, జీవితంలో ఎంత త్వరగా, ఎంత పైకి పోగలిగితే, అంతదూరం వెళ్లు అని– వాడా ఆశయాన్ని అక్షరాలా పాటిస్తున్నాడు వాడిని కలిస్తే, నీకు జీవితంలో పైకివచ్చే మార్గాలు చెబుతాడు!'' అన్నది సావిత్రమ్మ.

అర్జునరావ్ ఒక క్షణం ఆలోచించాడు. బయట వరండాలో పడక్కుర్చీలో పడుకుని అంతకు ముందు రోజు పేపర్లోని రేడియో ప్రోగ్రాం వివరాలు దీక్షగా చదువుతున్న డాడీని ఒకసారి సూటిగా చూసి ''అలా అయితే తొందరగా అన్నం పెట్టు మమ్మీ'' అన్నాడు.

ఆవిడ కొడుకుని ఆప్యాయంగా చూసింది. పైకి అంటే డాడీకి ఎక్కడ వినపడుతుందో అని మనసులో ''మా నాయనే'' అని కూడా అనుకున్నది.

''ఏమిట్రా– ఇలా మధ్యాహ్నంపూట ఎండలో వచ్చావ్!'' అర్జునరావ్ లోపలకు రాగానే అన్నాడు సుబ్బారావు మామయ్య.

ఆయన కూడా కాళ్లమీద నిలబడడు. ఆశయాలమీదే నిలబడతాడు అందుకని ఏమీ ఆయనతో మాట్లాడకుండా, చకచకా లోపలి గదిలోకి వెళ్లాడు అర్జునరావ్.

ఎండాకాలం ఎండలో వచ్చాడు కదా, వినపడలేదేమో ననుకున్నాడు సుబ్బారావ్ మామయ్య. అనుకుని మొన్నటి పేపరులోని వాతావరణ విశేషాలు చదువుతూ కూర్చున్నాడు.

అప్పుడే భోజనం చేసి బెడ్ రూమ్‌లో మంచంమీద విలాసంగా పడుకుని మధ్యాహ్నమే వచ్చిన రేపటి తారీకు సాయంత్రం పేపరు చూస్తున్నాడు కృష్ణ.

''ఏం బావా ఆఫీస్‌కి శెలవా?'' అడిగాడు అర్జునరావ్ వస్తూనే.

''ఏరోయ్– నువ్వా– రారా... ఏమిటి వస్తూనే ఎండాకాలం జోక్ వేశావ్– ఇవాళ శెలవెందుకు? ఏ పెద్దవాడయినా హరీ అన్నాడా...''

''అందుక్కాదు– నువ్వు యింట్లో వుంటేను!'' పడీపడీ నవ్వాడు కృష్ణ– ''నేను రోజూ ఈ సమయంలో ఇంట్లోనే వుంటాను!'' అన్నాడు ఫలానా సినిమా తార నేనెప్పుడూ ఈ ఫలానా సబ్బునే వాడతాను అన్నంత సహజంగా.

ప్రక్కనే వున్న కుర్చీ లాక్కుని దాంట్లో కూర్చుంటూ అన్నాడు అర్జునరావ్–

''మా అమ్మ నిన్ను అర్జంటుగా కలవ మంటేనూ – యిలా వచ్చాను.''

ఒకసారి సాలోచనగా అతన్నిచూసి నవ్వాడు కృష్ణ.

''అయితే ఏదో విశేషం వుందన్నమాట'' అన్నాడు.

''నాకు ఫలానా ప్రభుత్వోద్యోగం వచ్చింది!'' అంటూ ఆర్డర్ కాగితం అందించాడు అర్జునరావ్.

''వెరిగుడ్– కంగ్రాట్యులేషన్స్'' అంటూ ఆర్డర్ దీక్షగా చదివాడు కృష్ణ–

చదవటం అవగానే ''అయితే ఎప్పుడు చేరుతున్నావ్'' అని అడిగాడు.

''రేపే చేరదామనుకుంటున్నాను!'' అని డాడీ చెప్పిన విషయాలూ, మమ్మీ యిచ్చిన సలహా, అసలు తను ఎందుకు వచ్చినదీ వివరంగా చెప్పాడు అర్జునరావ్.

అంతావిని ''గుడ్‌గాడ్– ఎంత ప్రమాదం తప్పింది'' అని అరిచాడు కృష్ణ.

అర్జున్ ఉలిక్కిపడిలేచి ''ఏమయింది?'' అని అడిగాడు.

''ఏమయిందా? ప్రమాదం తప్పింది – వెనకటికెవడో తన పెళ్లికి ఆహ్వానిస్తే 'పెళ్లి కూతురు ముండదేవూరు' అని అడిగాట్ట మీ నాన్నలాటి పెద్దమనిషి. శుభమాఅంటూ ఉద్యోగంలో చేరబోతుంటే, నీతి నిజాయితీ అంటూ అవేంమాటలురా – మీ డాడీ మరీ బరితెగించి పోతున్నాడు. మీ అమ్మ నిన్ను రక్షించింది కానీ లేకపోతే ఈపాటికి ఏమయిపోయివుండేవాడివి'' మెత్తగా చివాట్లు వేశాడు కృష్ణ.

''అయితే మా నాన్న చెప్పిన మాటలేమీ వినవద్దంటావా?''

''చెడిపోవాలని వుంటే విను– నా కభ్యంతరంలేదు. కానీ ఒకటిమాత్రం గుర్తుంచుకో –లివ్ అండ్ లెట్‌లివ్ అన్నారు. నేను ఈ పదేళ్లలో ఎంత పైకి వచ్చానో తెలుసా? నాకన్నా ముందు, నాకన్నా పెద్ద వుద్యోగాల్లో చేరినవాళ్ళు, ఇప్పుడు నా దగ్గరే పని చేస్తున్నారు. నీకు వినేవుత్సాహమూ, నేను నడిచిన పద్ధతిలో నడవాలనే కోరికా, దీక్షా వున్నాయంటే చెప్పు. నా జీవిత విజయోత్సాహపు ఫార్ములా చెబుతాను. నూటికి, నూరుపాళ్ళు రిజల్ట్స్ గారంటీ...''

అర్జునరావ్ ఆలోచనలో పడ్డాడు.

కృష్ణ వెంటనే అన్నాడు ''వెనకటికి మహాకవి గురజాడ అప్పారావ్ ఏమన్నాడో తెలుసా? 'వెనకపడితే వెనకేనోయ్!' అన్నాడు. ఆయనలా అనటానికి ఇన్‌స్పిరేషన్ యిచ్చిందెవరో నీకు తెలుసా?...''

## మాటలు-చేతలు

డబ్బు
తుచ్ఛమైందంటూనే
దాన్ని
సంపాదించడానికి
అడ్డదార్లు
తొక్కుతుంటాడు –
మనసు
స్వచ్ఛమైందంటూనే
దాన్ని
మసిపూసిన మారేడుకాయ
చేస్తుంటాడు –
విజం
నిప్పులాంటిదంటూనే
దాన్ని
ఆర్పడానికి
ప్రయత్నిస్తుంటాడు –
స్నేహం
పవిత్రమైందంటూనే
వెన్నుపోటు
పొడవాలని చూస్తుంటాడు –
అందుకే –
నే నంటాను
మనిషి
ఆడే మాటలకి
చేసే చేతలకి
ఎక్కడా పొంతన వుండదని
ఎక్కడా సాంత్వన పొందడని

– కాద సరోజా రాణి

# గీతోపదేశం

అర్జునరావ్ బేలగా చూశాడు తలవంచుకున్నాడు.

"మీ నాన్న — మా నాన్న"

అర్జున్ తల ఎత్తి, చిరునవ్వు నవ్వాడు.

"ఇంకో విషయం చెబుతాను విను — మొన్నీమధ్య మహాకవి శ్రీ శ్రీ ఏమన్నాడో తెలుసా — 'పదండి ముందుకు — పదండి త్రోసుకు — పోదాం పోదాం పైపైకి' అని— ఆయన అలా అనటానికి ఇన్‌స్పిరేషన్ ఇచ్చిందెవరో తెలుసా ?"

"తెలుసు - నువ్వే!" అన్నాడు అర్జునరావ్

"సెభాష్ — దారిలో పడుతున్నావ్ — అయితే ఇంతకీ ఏం నిశ్చయించుకున్నావ్ — యింకో గురజాడకిస్తావా యిన్‌స్పిరేషన్ — శ్రీ శ్రీ కా ?"

"శ్రీ శ్రీ కే"

"గుడ్ — పైకొస్తావ్ త్వరత్వరగా — అక్కడ ఆ పుస్తకం వెనక సిగరెట్ పాకెట్ వుంది అందుకో — ఆ తలుపు కూడా వేయి. నేను సిగరెట్ త్రాగుతుండగా మా నాన్న చూస్తే బాధ పడతారు" అన్నాడు కృష్ణ.

అర్జునరావ్ నవ్వి "ఇంకా నాన్న భయమేమిటి బావా!" అన్నాడు

కృష్ణ సిగరెట్ వెలిగించి, గుండెలనిండా పొగపీల్చి, బయటకు వదిలి "భయంకాదురా బావా! భక్తి భక్తి ఎంత ఎక్కువగా చూపించినవాడికి అంత ముక్తి - ఇదే నీకు నేను చెప్పదలచుకున్న మొదటి పాఠం"

అర్జునరావ్ కుర్చీ దగ్గరకు లాక్కుని, పరీక్షలు రేపనగా అవుటయిన క్వొశ్చన్ పేపరును వింటున్నంత దీక్షగా వింటున్నాడు.

"ఉద్యోగపు వైకుంఠ పాళీలో మొదటి గడిలో, రేపు కూర్చోబోతున్నావ్ నువ్వు — అంటే రేపు ఆట ప్రారంభం అవుతుంది. పాముల్ని తప్పించుకుంటూ, నిచ్చెనలు ఎక్కుతూ, మిగతావారిని దాటుతూ ఎంత త్వరగా నువ్వు పైకి వెళ్ళగలిగితే — అంత తొందరగా జీవితంలో గెలుస్తావ్. సుఖపడతావ్. మీ నాన్నలాటి వాళ్ళ ముక్కు సూటిగా వుంటుంది. అందుకని అదే డైరక్షన్‌లో పోతారు వాళ్ళు. వాళ్ళను అడుగడుగునా పాములు కాటేస్తాయి. నిచ్చెనలు ఎక్కటం చేతకాక, వాటిని నెత్తిమీద వేసుకుంటారు.

> **ఇంధనాలు !**
>
> నీ భావాలు ..
> అందరి హృదయాలలో
> కలిగించాలి స్పందనాలు !
> ఆ భావ కవితలే —
> సుగంధ భరిత పుష్పాలు ...
> మానవచిత్త వికాస ప్రేరక —
> విచిత్ర ఇంధనాలు !
>
> — ఎస్. వి ఆర్ సత్యనారాయణమూర్తి

కానీ నీ ముక్కు అంత సూటిగాలేదు కనుక నీకు ఫరవాలేదు నేను చెప్పినట్టు విను — పైకి వస్తావ్!" ఆగాడు కృష్ణ

అర్జునరావ్ "బావా! కృష్ణా! నువ్వు నాకన్నా వయస్సులోనూ, లోకజ్ఞానంలోనూ పెద్దవాడివి- 'నీ ఉపదేశం' వినటానికీ, విని పాటించటానికీ సిద్ధంగా వున్నాను — ప్రారంభించు" అన్నాడు

కృష్ణ సిగరెట్టు పొగతో, సుదర్శన చక్రంలాటి రింగును సుకుమారంగా వదిలి, విలాసంగా నవ్వి ప్రారంభించాడు—

"నాకు ఎవరూ ఉద్యోగంలో పైకి పోవటానికి ఉపయోగపడే అభివృద్ధి సూత్రాలు నేర్పలేదు చుట్టుపక్కల వున్న మనుష్యుల్ని చూసి అన్నీ ఆకళింపు చేసుకున్నాను అలాగే నువ్వుకూడా నేర్చుకోవాలి సూచనప్రాయంగా కొన్ని సలహాలను మాత్రం యిస్తాను - అవి వుపయోగించటం నీ తెలివితేటలమీద ఆధారపడి వుంటుంది"

ఒక్క క్షణం ఆగి, ఏదో ఆలోచించి మళ్ళీ ప్రారంభించాడు కృష్ణ—

"ఉద్యోగపు అంతస్థుల అభివృద్ధి సూత్రాల్లో మొదటిది, ముఖ్యమైనదీ భజన చేయటం దీన్నే 'కాకా' అనికూడా అంటారు అలాగే రెండోది "రాజకీయాలు" చేయటం. కొన్నిసార్లు ఆత్మ రక్షణ కోసం చేయవలసి వస్తే, కొన్నిసార్లు అవతలివాడిని మింగేయటం కోసం చేయవలసి వస్తుంది పెద్ద చేపల బారి నించి తప్పించుకుంటూ, చిన్న చేపల్ని తినటం అన్నమాట మూడోది 'ఆమ్యామ్యా...' అంటే లంచాలు తినటం, పైవాళ్ళకు తెలీకుండా తినటం, వాళ్ళ ప్రమేయంతోనే తినటం, తినిపించటం, తర్వాత ఆర్థికంగా బలం పెంచుకోవటం, ధన సంపా

దినదినాభివృద్ధి కాకపోయినా, కనీసం ఏడాదికి ఒకసారైనా పదవులు పెంచుకోవటం. రాజ్యాలు, సామ్రాజ్యాలు నిర్మించుకుని, మకుటంలేని మహారాజు అవటానికి ప్రయత్నం చేయటం... ఇలా చాలా వున్నాయి అవన్నీ వివరంగా చెప్పడం మొదలు పెడితే, రేపు నువ్వు వుద్యోగంలో చేరలేవు. రేపే కాదు, నెలరోజుల దాకా చేరలేవు. ఈ లోగా నీతో పాటు రేపు చేరిపోవాల్సిన ఇంకోడు, నీకు బాస్ అయిపోతాడు. కనుక ముందుగానే అన్నీ తెలుసుకోవాలంటే కుదరదు. నెమ్మదిగా అన్నీ తెలుసుకుందువుగాని. మిగతా కొలీగ్స్‌తో మెలగటం ఎలా ? అన్నది అవసరం. అవి రేపటి నుంచే అమలులోకి తేవలసిన సూత్రాలు కనుక ముందు ఆ విషయాలు చెప్తాను! సరేనా!''

''సరే బావా- చెప్పు- రేపు పదింటికి ఆఫీసులో చేరిపోయి, సాయంత్రంలోగా ఎన్ని మెట్లెక్కగలనో చూస్తాను!'' అన్నాడు అర్జునరావ్ హుషారుగా.

''అర్జునా! మరీ అంత తొందరపడకు- ఈ ప్రభుత్వ రంగంలో పనిచేయాలంటే ప్రతి అడుగూ ఆలోచించి వేయాలి నీకుముందుగా ఒక చిన్న కథ చెబుతాను పూర్వం మహా శివుడు, లోక గణాధిపత్యం వినాయకుడికి యివ్వాలా, కుమారస్వామికి ఇవ్వాలా అన్న మీమాంసలో పడ్డాడుట చివరికి నారదుల వారి సలహామీద ప్రపంచం అంతా ఎవరు ముందు చుట్టి వస్తే వారికి ఆ పదవి ఇస్తానని ప్రకటించాడట కుమారస్వామి ప్రపంచం అంతా తిరుగుతూ, ప్రతి పుణ్య క్షేత్రం దర్శిస్తూ, ప్రతి నదిలో స్నానంచేస్తూ, శ్రద్ధగా, చాలా సిన్సియర్‌గా, ఫుల్ జాబ్ సాటిస్‌ఫేక్షన్‌తో, పని ముగించుకువచ్చాడుట. కానీ వినాయకుడు మాత్రం ఆ గది దాటి బయటకు వెళ్ళకుండా, శివుడి చుట్టూ తిరుగుతూ భజన చేశాడట అప్పుడు శివుడు గణాధిపత్యం ఎవరికి యిచ్చాడో తెలుసా? సిన్సియర్ అంటే హార్డ్ వర్కింగ్ అయిన కుమారస్వామికి కాదు తన చుట్టూ తిరిగి శాయశక్తులా భజన చేసిన వినాయకుడికి అంటే ఏమిటి? మన పవిత్ర పురాణాలుకూడా ''భజన'' చేసి పదవులు సంపాదించండి అని చెబుతున్నాయన్నమాట కనుక నీకు యివాళ భజనల గురించి, వాటి విశిష్టత గురించీ చెబుతాను శ్రద్ధగా విని, నియమం తప్పకుండా ఆచరించినవాళ్ళు అన్ని జన్మలలోనూ, విన్ని ప్రమోషన్సు కావాలంటే, అంతకు రెట్టింపు ప్రమోషను తెచ్చుకుని లోకకల్యాణం చేస్తూ, వాళ్ళు మాత్రం బాగా సుఖపడతారు.''

అర్జునరావ్‌కి కథ వినగానే కృష్ణమీద చాలా గొప్ప అభిప్రాయం కలిగి వెంటనే ''బావా! నువ్వు సర్వ జ్ఞానివి సంభవామి యుగేయుగే అన్నారు నీకిదే నా నమస్కారం'' అన్నాడు.

''ఇమ్మీడియేట్‌గా ప్రమోషన్ ప్రాప్తిరస్తు'' అన్నాడు కృష్ణ.

''ఆలస్యం చేస్తే అమృతం కూడా విషమవుతుందట బావా- త్వరగా చెప్పు'' అన్నాడు అర్జునరావ్ అసహనంగా.

''నీ వుద్యోగంలో అడుగడుగునా వుపయోగపడే 'భజన' సూత్రం గురించి తెలుసుకుందాం. శివుడి అంతటి వాడు భజనకు గురిఅయి, లొంగిపోయాడంటే, ఆ భజన మహాత్యం ఏంతో తెలుస్తుంది అది గ్రహించే ఈ రోజుల్లో పైకి వద్దామనుకుంటున్న వాళ్ళందరూ, ఈ ఫార్ములానే వాడుతున్నారు. బాగుపడుతున్నారు. ఈ భజన లేక కాకా అన్నది ఎన్నాళ్ళక్రితం పుట్టిందో చెప్పటం కష్టం శివుడి చిన్నప్పటినించీ బహుశా వుండి వుండవచ్చు. భక్తుల పొగడ్తలకు ఆయన సంతోషించి వరాలిచ్చినట్టు మన పురాణాలు ఘోషిస్తున్నాయి కనక పూర్తిగా మన దేశంలో కనుగొనబడిన 'కళగా' దీన్ని పేర్కొనవచ్చు. మన దేశంలో పుట్టినా, తర్వాత విదేశాలకు కూడా ఎగుమతి అయిన ఈ కళని- ఇంగ్లీష్‌లో బట్టరింగ్ ( వెన్న పూయుట ) అంటారు. మన పురాణాలలోనూ, చరిత్రలోనూ ఈ భజన గురించి ఉదాహరణలు ఎన్నోవున్నాయి. కానీ అవన్నీ వినటానికి నీకు బోరు కొట్టేయవచ్చు. అందుకని నేను చెప్పే కథలన్నిటిలోనూ వున్న 'నీతి'ని గ్రహించు చాలు. భజన లేక కాకా అన్న ఈ ఆయుధాన్ని దేవుళ్ళదగ్గర భక్తులు, భక్తుల దగ్గరదేవుళ్ళు, దేవతలదగ్గర వందిమాగధులూ, రాజులదగ్గర భట్రాజులూ, ఆఫీసర్లదగ్గర వుద్యోగులూ, పగటిపూట భర్తలదగ్గర భార్యాలూ, రాత్రిళ్ళు భార్యలదగ్గర భర్తలూ, ఎలక్షన్లముందు ప్రజలదగ్గర మంత్రులు, ఎలక్షన్ల అయ్యాక మంత్రులదగ్గర ప్రజలూ, యిలా నానావిధము లయినవాళ్ళూ వాడినట్లు ఆధారాలున్నాయి. కనుక భజన చేయుటయే ధ్యేయంగా పెట్టుకుంటే, నీకు ముక్తి కలుగుతుంది — ఏదీ యింకో సిగరెట్టు వెలిగించుకోనీ !'' అన్నాడు కృష్ణ.








బులుసు వేంకటరమణయ్య

# శ్రీరాముని ఔదార్యం

శ్రీరాముని అచంద్రతారార్కమైన కీర్తి ఉండుటకు కారణం అతని సత్య వాక్పాలన, శరణాగత రక్షణ, మహా పరాక్రమం, సాధుజన రక్షణ, దుష్టశిక్షణ మున్నగు ఉత్తమ గుణాలని అందరికీ తెలుసు. ఆ రీతిగనే అతని ఔదార్యం ఎంతో ప్రసిద్ధికెక్కింది.

శ్రీరాముడు రావణునితో యుద్ధానికి సిద్ధంగా ఉండగా— రాక్షస కులానికి సర్వ నాశనం సంభవించగలదని గ్రహించి రావణునికి సోదరుడు విభీషణుడు హితాన్ని బోధించాడు. అతడు వినలేదు. తమ్ముణ్ణి శత్రుపక్షీయుడని దూషించి వెళ్ళగొట్టాడు. అందువల్ల విభీషణుడు రాముని వద్దకు వచ్చి శరణు వేడాడు.

రాక్షసుల మాయలు తనకు తెలియునివి కావనీ, విభీషణుడు రావణుని తమ్ముడు కావున అతని మాటలు విశ్వసింపదగవనీ శ్రీరామునికి సుగ్రీవాదులు గట్టిగా చెప్పారు. కాని, శరణు చొచ్చినవాడు శత్రువయినా, అతనికభయం ఇవ్వడంతన ధర్మమని రాముడు చెప్పాడు. పరిశీలించి చూస్తే విభీషణుడు మోసగానివలె తనకు తోచలేదన్నాడు. ఒకవేళ — ఇట్టి సమయంలో మహాపరాధి అయిన రావణుడు వచ్చి తన్ను శరణు చొచ్చినా, అతనికి అభయం ఇవ్వడానికి తాను సిద్ధంగా ఉన్నట్లు కూడా అతడు తెలియజేశాడు.

ఇతరులందరూ వ్యతిరేకించినా, హనుమంతుడు వ్యతిరేకించలేదు. తాను రావణుని సభలో ఉన్నప్పుడు— విభీషణుడు విన్నోవిధాల అన్నగారికి హితాన్ని బోధించాడనీ, ఆ హితాన్ని రావణుడు వినలేదనీ చెప్పాడు. హనుమ మాటలపై రామునికి విశ్వాసం ఉన్నది. రాముడు ఇతరుల మాటలు లెక్కచేయకుండా విభీషణానికి అభయం ఇచ్చి, ఎంతో ప్రేమతో గౌరవించాడు.

యుద్ధంలో రావణుడు మరణించక తప్పదనీ, విభీషణుడు లంకారాజ్యానికి రాజు అయి తీరునని శ్రీరాముని నిర్ణయం. అందువల్ల వెంటనే అతనిని లంకకు రాజుగా అభిషేకించాడు.

అప్పుడు విభీషుడు "ప్రభూ! నేను కోరినది శరణు మాత్రమే! మీరు నన్ను లంకకు రాజుగా అభిషేకించడం తగదు. ఒకవేళ మా అన్న రావణుడు మీ కాళ్ళపై పడి శరణు వేడితే అతని రాజ్యం అతనికి ఇచ్చివేయవలసి వుంటుంది కదా!" అని అన్నాడు.

"నీవు లంకకు రాజు వగుట తప్పదు. నీవు చెప్పినట్లు రావణుడు నాకు శరణాగతుడైతే— అతని ఆధిపత్యానికి లోటు వుండదు. అప్పుడు నేను అతనికి నా రాజ్యాన్నే ఇచ్చి, అతణ్ణి అయోధ్యకు అధిపతిగా చేస్తాను. నీవు నీ రాజ్యాన్ని ఇయ్యనక్కరలేదు" అని అన్నాడు.

ఆ మాటలకు అక్కడి వారందరూ నిర్ఘాంతపోయారు. "శ్రీరాముని ఔదార్యం" అట్టిది!

---

# గీతోపదేశం

అర్జునరావ్ వెంటనే కృష్ణ నోటికి సిగరెట్ అందించి వెలిగించాడు.

"భేష్! నా పాఠాలు నీకు వంటబడుతున్నాయి. ఈ భజనలో చాలా రకాలు వున్నాయి. వాటి అన్నిటిలోకీ బాగా ముఖ్యమైనది పర భజన. అంటే వినాయకుడు శివుడికి చేసిన భజన అన్నమాట, ఆఫీసర్‌కి వుద్యోగి చేయవలసిన భజన అన్నమాట. అంటే నువ్వు రేపు ఆఫీసుకు వెళ్ళి, జాయినింగ్ రిపోర్టు యివ్వగానే చేయవలసినమొదటి పని అన్నమాట. ఈ పరభజన అన్నదాని విశిష్టత గురించి నీకు ఇందాక వినాయకుడి కథ చెప్పాను కదా. పురాణాలలోనే యింకో కథ కూడా చెబుతాను. ఎందుకంటే మన భారతీయుల్లో ఒక దౌర్భాగ్యం వుంది. సూటి వాదంతో చెప్పేది మనకి తొందరగా అనదు. అదే పురాణాల మంత్ర తంత్రాల కథలతో రంగరించి యిస్తే వెంటనే చెంపలు వేసుకుని మరీ ఒప్పేసుకుంటారు. పూర్వం రాముల వారు, మిసెస్ సీతారామారావ్‌గారిని అడవిలో పారేసుకున్న కథ నీకు తెలుసు. రావణాసురుడనే ఎమ్పీ రంగారావ్ ఆవిడ్ని ఎత్తుకుపోయాడు. రాముడు ప్రతి పుట్టలోనూ, చెట్టుమీదా వెదుకుతూ, కోతి అనే హనుమంతుడిని కలిశాడు. తర్వాత ఆ హనుమంతుడే 'పని' జరిపించాడనుకో. ఆ సందర్భంలో, హనుమంతుడ్ని సముద్రం దాటి లంకలోకి పదమన్నాడు రాముడు. హనుమంతుడు అంత పొడుగు ఇండియన్ ఓషన్ని దాటటానికి వెనకాడేడు. అప్పుడు రాముడు ప్లస్ మిగతా కోతులు వాడిన ఈక్వేషన్ ఏమిటో తెలుసా? పర భజన. ఈ నాడు మనం పాడుతున్న పరభజనే అందరూ ఆంజనేయుని మాట్లాడి నువ్వంతవాడివి, ఇంతవాడివి, ఎంతెంతవాడివి అని బాగా ఉబ్బేశారు ఆయన్ని. ఆ భజనలో ఎక్కడలేని శక్తి తెచ్చుకుని సముద్రం మీదనుంచి జామ్మని ఎగిరి కంబైన్డ్ లాంగ్ అండ్ హై జంప్‌తో ఒలింపిక్ రికార్డు పెట్టేసి, గోల్డ్ మెడల్ కొట్టేశాడు మిస్టర్ అంజనేయులు. సముద్రాన్ని అలా అవలీలగా దాటించిన శక్తి మన ఫ్రెండ్ ఆంజనేయులుగారిది కాదు. అక్షరాలా ఆయనకి చేసిన భజనది. భజన అన్నది అంత శక్తివంతమైన ఆయుధం అన్నమాట. అలాగే మనం దేవుళ్ళకి, దేవతలకి చాల పూజలూ, స్తోత్రాలు చేస్తాం. ఆ మంత్రాల్లో ని ముందో ఎప్పుడయినా అర్థం చేసుకున్నావా?" అని అర్జునరావుని అడిగాడు కృష్ణ.

( ముగింపు పైవారం )



# ఆంధ్రప్రదేశ్ రజతోత్సవం



## అభివృద్ధి శిఖరాల అంచుల్లోకి...

**శ్రీమతి ఇందిరాగాంధి**
ప్రధానమంత్రి

**శ్రీ టి. అంజయ్య**
ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి మార్గదర్శకత్వంలో శ్రీ టి.అంజయ్య చైతన్య పూరితమైన నాయకత్వంలో అభ్యుదయగామిగా ఆంధ్రప్రదేశ్ సత్వరాభివృద్ధి సాధిస్తూ ముందడుగు వేస్తోంది. ఈ రజతోత్సవ సంవత్సరంలో సృజనాత్మకమైన పథకాలు, నూతనకార్యక్రమాలఅమలు ఫలితంగా మన రాష్ట్రం సర్వతోముఖాభివృద్ధి సాధించింది. ఆర్థిక పురోభివృద్ధిలోను, ప్రజల సంక్షేమ రంగంలోను మన రాష్ట్రం అనూహ్యమైన రీతిలో పురోగమించింది.

శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రాల కార్యక్రమంతోపాటు, 5 సూత్రాల కార్యక్రమాన్నికూడా పటిష్ఠంగా అమలు జరపడంతో మన రాష్ట్రం ప్రగతికి బాటలు వేస్తోంది.

రైతులకు ప్రోత్సాహకాల పంట :

- ☐ 10 ఎకరాల మెట్ట లేదా 5ఎకరాల మాగాణి కన్నా తక్కువ భూమిగల కమతందార్లకు భూమిశిస్తు ఉండదు.
  పంటల బీమా పథకం ప్రవేశపెట్టారు.

వెలుగు జిలుగులు

- ☐ స్థాపిత విద్యుదుత్పాదకశక్తి రికార్డు స్థాయిలో 2,298 మెగావాట్లకు చేరుకుంది.

పేదలకు గృహాలు — సమాజ సంక్షేమం :

- ☐ 1980—81 సంవత్సరంలో 1,50,478 కుటుంబాలకు ఇళ్ల స్థలాలు సమకూర్చారు. ఇందుకోసం 7,238ఎకరాల ప్రైవేటు భూములు సేకరించడంతోపాటు 2,161 ఎకరాల ప్రభుత్వ భూములు వినియోగించారు.
- ☐ ప్రస్తుత సంవత్సరంలో షెడ్యూలు కులాల అభ్యున్నతికి వీలుగా ప్రత్యేక అంశాలకార్యక్రమానికి రు. 52కోట్లు కేటాయించారు, 1975—80 లో కేవలం రు. 5.25 మాత్రమే వినియోగించారు.
- ☐ వికలాంగులకు నెలకు రూ. 30ల చొప్పున నిరుద్యోగ భృతి కల్పిస్తారు.

పరిశ్రమల ప్రగతి, కార్మికులకు ప్రోత్సాహం :

- ☐ 1981 జులైలో సింగరేణి బొగ్గు గనులలో రికార్డుస్థాయిలో 1,00,000 టన్నుల బొగ్గు ఉత్పత్తి సాధించారు.
- ☐ ఆంధ్రప్రదేశ్ చేతి వృత్తుల అభివృద్ధి కార్పొరేషన్ ఏర్పాటు చేశారు.

మారుమూల ప్రాంతాలకు సేద్యపునీటి సౌకర్యం :

- ☐ పోలవరం ప్రాజెక్టుకు శంకుస్థాపన జరిగింది.
- ☐ శ్రీశైలం కుడి కాలువ నిర్మాణం చేపట్టారు.
- ☐ జూరాల ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభమైంది.

గ్రామరాజ్య పథంలో — గ్రామస్వరాజ్ .

- ☐ దశాబ్దానికిపైగా తర్వాత గ్రామపంచాయతీలు, సమితులకు ప్రత్యక్ష ఎన్నికలు ప్రశాంతంగా నిర్వహించారు.
- ☐ ప్రప్రథమంగా 18 సంవత్సరాల వయస్సుగలవారికి వోటు హక్కు ఇవ్వబడింది.

సహకార సంఘాలు :

- ☐ 1980—81 సంవత్సరంలో రికార్డు స్థాయిలో రు. 90.90 కోట్ల మేరకు స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలను మంజూరు చేశారు.
- ☐ కేంద్ర సహకార వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు రికార్డుస్థాయిలో రు. 68కోట్లమేరకు దీర్ఘకాలిక ఋణాలను మంజూరుచేసింది.

రేపటి పౌరులకు ఉత్తమ విద్య : :

- ☐ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేశారు.
- ☐ సమగ్ర విద్యా బిల్లు ఆమోదించారు.

సమర్థత పెంపుదలకు సర్వీసుల క్రమబద్ధత :

- ☐ పౌరసంపిణీ పద్ధతిని క్రమబద్ధం చేయడానికి అత్యవసర సరకుల సరఫరా కార్పొరేషన్‌ను ఏర్పాటు చేశారు.
- ☐ 1980—81లో రాష్ట్రం ఆదాయం రూ. 5,975.08 కోట్లనుంచి రూ. 6,915.51కోట్లకు 15.7శాతం పెరిగింది.
- ☐ మునిసిపల్ ప్రాంతాలన్నిటిలో గుడిసెల అగ్నిప్రమాద బీమా పథకాన్ని ప్రవేశపెట్టారు.

Advt No 50

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.** DIPR No. 21539/Advt/Cl.-3/81

# వారఫలం

**4-12-1981 శుక్రవారం మొదలు 10-12-1981 గురువారం వరకు**

మేషం : గ్రహగతిలోని మార్పులు మీకులాభదాయకములని తెలిసికోవాలి. దైవ కార్యనిర్వహణకు, వ్యాపారవిస్తరణకు, రాజకీయంగా మేలుపొందుటకు ధైర్యాను గ్రహ సంపాదనకు ఈ వారం శుభం. స్త్రీలకు: దైవచింతన, అభివృద్ధి ఉద్యోగలాభం, శుభం జరుగనున్నది.

వృషభం : కళారంగంలో, పత్రికారంగంలో రేడియో, దూరదర్శిని, కథాకాలక్షేపాలలోపాల్గొను వారికి, సాహిత్యరంగంలో చేయి తిరిగినవారికి, ప్రజాదరణయందు పాటుపడువారికి, ఉద్యోగాన్వేషణలో శ్రమించువారికి అవకాశములుండగలవు. వ్యాపారంలో ప్రగతి కనిపిస్తుంది. స్త్రీలకు: నూతన వ్యవహారాలు తెలిసి కోవటం,నూతన వృత్తికై ప్రాకులాడు వారికి శుభ సూచన గలదు.

మిథునం: గృహ సంబంధమైన చిక్కులు తలయెత్తనున్నవి.నూతన ప్రయత్నాలలో ఆశాభంగానికి అవకాశమున్నది.గ్రహస్థితి ప్రగతినిరోధకమని, ఆరోగ్య భంగమునకు దోహదం చేయుగలదని గ్రహించాలి.స్త్రీలకు: సుఖశాంతులకు లోపం,గృహవాతావరణంలో అశాంతి కల్గుటలో ఆశ్చర్యంలేదు. గ్రహించండి.

కర్కాటకం: ఉన్నతాధికారులకు, ఉద్యోగప్రయత్నాభిలాషులకు,దూరప్రాంతాలకు ప్రయాణింపదలచు వారికి, తంతితపాలా శాఖయందున్న వారికి సాహిత్యాభిలాషులకు అవకాశాలుండగలవు.వ్యాపారలోపం లేదు. పెద్దల వలన, అధికారుల వలన జరుగ దగిన వ్యవహారాలు సుకరంగా జరుగ గలవు. స్త్రీలకు: పెద్ద పెట్టున ఏదోమేలుజరుగబోవుచున్నదని గ్రహించాలి.

సింహం: మీ ప్రయత్నాలకు అంతరాయులు రావటంతో, నిరుత్సాహత జనిస్తుంది. మిత్రులెవరో మీకార్యక్రమమందు సహాయ పడగలరనిఊహించుట యందే కాలంగడచి పోతుంది. ఉద్యోగమందు అధికారులబెడద యుండగలదేమో! గ్రహించి నడచుకోండి. స్త్రీలకు: ఉన్నదానితో తృప్తి పడటం, శాంతికి భంగకరమైన విషయాలలో జోక్యం కలుగ జేసికొనకుండటం మేలు.

కన్య: మీరాశియందు స్థితుడైన'శని'గ్రహం, శరీరరుగ్మతకు కారకు డవుతాడు. వయసుమీరిన వారు యింకా జాగరూకత వహించాలి. వ్యాపారం సర్వ సామాన్యంగా జరిగిపోతుంది. స్త్రీలకు : నూతన వ్యవహారాలు తెలిసి కోవటం, బంధు సమాగమం, మిత్ర సందర్శనం, కించిత్తు ధన లాభానికి లోపం లేదు.

తుల:సాధారణంగా, సక్రమంగా,జరిగిపోతాయి అని అనుకొనే విషయాలలో అవాంతరం ఏర్పడ గలదు. వస్తువులేవో పోతాయి అని చెప్పవీలున్నది. మతి మరపువల్ల అనేక యిబ్బందులు జరిగే అవకాశమున్నది.ప్రమాదపరిస్థితులేమైనాజరుగుతాయేమో జాగ్రత్త. స్త్రీలకు: బంధువుల రాకతో సతమతం కావటం, స్వల్పాదాయం గల వారం.

వృశ్చికం:నూతన వికాసం, నూతన ప్రయత్నాలలోఆదాయాభివృద్ధి,చివరకు మొదలుపెట్టినవ్యాపారంలోఅభివృద్ధి, చికాకులుతొలగటం, సంపూర్ణంగా సత్ఫలితాలుఅందుకోవటం, రాజకీయంగా కొందరకు ఆశించిన ఫలితాలు అందటం గమనింప గలరు. స్త్రీలకు:సుఖ శాంతులు, ప్రయాణాలు, చెప్పదగిన వారం.

ధనుస్సు: ముఖ్యకార్యాలలో మీకుస్వస్థత మేర దూరాన్నుండి శుభ వార్తలందుతవి. ఇదివరకుకావు, అనుకొన్న పనులు సుకరంగా నెరవేరేమార్గమున్నది. మిత్రుల వలన జరుగ గల పను కొన్ని పనులలో ఆశాభంగం కల్గుతుంది.స్త్రీలకు: సుఖ శాంతులకు లోపం, వృత్తిలో అనానుకూలత చెప్పదగి యున్నది.

మకరం: ఆదాయంగల వారం,అనవసరమైన పనులలో జోక్యం తగదు. ఏవో అనవసరమైన గొడవలో, మాటపట్టింపులోతగాదాలో సంభవించే మార్గమున్నది.జాగ్రత్తగా సంచరింప దగినవారం. ఉద్యోగ వృత్తులందు అభిమానుల వలన అనుకూలత ఏర్పడ నున్నది.స్త్రీలకు: అధికారంవృద్ధి కావటం ఒకవేళ ఉద్యోగప్రయత్నాలుంటే సానుకూలపడటం సంభవం.

కుంభం: చిత్రరంగంలో ప్రవేశమున్న వారికి ఏదైన ఒక వృత్తిలో నిమగ్నులైనవారికి, రాజకీయ యిబ్బందులు పడే వారికి క్రమంగా చిక్కులు విడివడేవారం.నూతన విషయ సేకరణకు, రేడియో 'దూరదర్శిని'లందు అవకాశములు కొందరకు'అష్టమ శని' వలన ఆరోగ్యం వయస్సు మీరినవారికి చెడే అవకాశం గల వారం.స్త్రీలకు: ప్రగతి అస్థిరంగా లందు చెప్ప వీలున్నది.

మీనం : మీ యింట శుభకార్యం జరుగగలదను నమ్మిక ఏర్పడగలదు గ్రహించండి. వ్యాపారం బాహాటంగా చేయువలసిన అవకాశమున్నది. వ్యవహారంలో, రాజకీయంగా కొందరకు అనుకూలవారం.స్త్రీలకు బంధువిరోధం యిబ్బందులు, శుభ కార్యానుకూలతలో ఆశాభంగం ఏర్పడ గల వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

సీరియల్

# జీవిత వనంలో కొత్తగాలి

## కుందుర్తి ఇందిరాదేవి

**10**

(గత సంచిక తరువాయి)

"నువ్వడిగింది ఏనాడైనా కాదన్నానా, నువ్వు రమ్మంటే ఎక్కడికైనా రానన్నానా, నీ ముద్దూ ముచ్చట కాదన్నానా, సరదాపడితే ఒద్దన్నానా" రేడియోలో వస్తున్న పాటకు, తనూ జతగలిపి పాడుతోంది ఉష టేబుల్‌మీద తలవాల్చి కూర్చున్న ఉష నన్ను గమనించలేదు

ఉష పాడుతుంటే ప్రక్కనే కూర్చుని రికార్డు వ్రాసుకుంటున్న శశి ఉషను రేడియో సౌండ్ తగ్గించమని గట్టిగా కేకలేస్తోంది చదువుకు కూర్చున్న ఫల్గుణ రెండు చెవుల్లోనూ గట్టిగా వేళ్ళుదూర్చి -

"ఉషా! రేడియో ఆపెయ్యవే తల్లీ నీకు దణ్ణం పెడతాను" అని బ్రతిమాలుతున్నాడు

"ఉషక్కా! ప్లీజ్ రేపు మాకు టెస్టుంది చదువుకోవాలి రేడియో ఆపేసెయ్యి" అని మీనా నెత్తిన రెండుచేతులూ పెట్టుకుని గోలపెడుతోంది

ప్రక్కనే కూర్చుని మర్నాటి ఉదయానికి కూరకోసం చిక్కుడుకాయలు ఒలుస్తున్న, అమ్మ -

"ఒసేయ్! ఉషా! కాస్త ఆ వెధవ రేడియో కట్టెయ్యవేమ్మా వీళ్ళు చదువుకుంటున్నారు సంధ్య వచ్చే వేళయింది" అంటోంది

ఆ మాట వినగానే ఉష ప్రక్కకి తిరిగి -

"అబ్బా! ఉండండే ఈ ఒక్కపాట అయిపోగానే రేడియో ఆపేస్తాను" అంటూ ఉష మళ్ళీ పాటలో మునిగిపోయి కూనిరాగం తీస్తోంది

నేను గుమ్మంలోకి అడుగుపెట్టగానే ఎదురైన దృశ్యం ఇది శశికి ఒళ్ళు మండిపోయిందిలా ఉంది

"నువ్వు రేడియో ఆపెయ్యకపోతే తంతాను జాగ్రత్త" అని అరిచింది

అప్పటికే పాట పూర్తయిపోయింది ఉష ఊ ఊ అంటూ కూనిరాగం తీస్తూ ప్రక్కకి చూసి ఎగిరిపడింది నన్ను చూడంగానే దాని నోరు టక్కున మూత పడింది కుడిచెయ్యి మెరుపులా రేడియోని ఆపేసింది

నేను ఉషని గట్టిగా కేకలు వెయ్యలేదు అందరినీ కలయచూస్తూ చివరికి శశిమీద నా కళ్ళు నిలిచిపోయాయి ఒక్కసారిగా ఇల్లంతా నిశ్శబ్దంగా అయిపోయింది శశి చప్పున పుస్తకంలోకి మొహం తిప్పుకుని వ్రాసుకోసాగింది నేను తదేకంగా శశి మొహం చూడసాగాను నా కంటెముందు పుట్టి పెరిగిన శశి అప్పుడే నేను ఊహించలేని స్థాయికి ఎదిగిపోయింది శశికి ఎలా చెప్పాలి ఏమని చెప్పాలి మొట్టమొదటిసారిగా ఈ కుటుంబం ఏమైపోతుందో అన్న దిగులు కలిగింది నాకు మొత్తం నాలుగు గదుల వాటా ముందు గదికి ప్రక్కనే బెడ్‌రూమ్ ఉంది నాన్నగారు పోయిన తర్వాత నేను దాన్ని నా గది క్రింద మార్చేసుకున్నాను ముందు గదిలోంచి లోపలికి వెడితే వంటగది, దాన్ని అనుకుని చిన్న స్టోర్ రూమ్, కొంచెం అవతలగా బాత్‌రూమ్ ఉన్నాయి

"సంధ్యా! అక్కడే నిలబడిపోయావేం" అమ్మ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాను ఉష సీరియస్‌గా చదువుకుంటోంది అందరూ చదువులో మునిగిపోయి ఉన్నా మధ్య మధ్య నావైపు ఒక చూపు చూస్తూనే ఉన్నారు నేను భారంగా ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాను బ్యాగ్ టేబుల్‌మీద పారేసి వెళ్ళి పడుకున్నాను నా జీవితంలో మొట్టమొదటిసారిగా నేను ఏమీ చేతకానిదాన్ని అన్న భావన కలిగింది

అమ్మ వచ్చి కాఫీ ఇచ్చింది త్రాగి కప్పు

**జరిగిన కథ - 5 :** పోతూ పోతూ ఆ కుటుంబ భారంతోపాటు చేసిన అప్పు కూడ పెద్దకూతురైన సంధ్యపై వేసి కన్నుమూస్తాడు ఆమె తండ్రి ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్ళకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది ఎప్పుడైనా డబ్బు అవసరమైతే తన స్నేహితురాలు ప్రమీల దగ్గర తెచ్చుకుని మళ్ళీ ఇచ్చేస్తుంటుంది ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతూంటుంది ప్రమీల పుట్టినరోజు పార్టీకి సంధ్యా, కిరణ్‌లు వెళతారు, ఆమె ఆహ్వానించగా పార్టీ పూర్తయిన తర్వాత తన స్కూటర్‌పై సంధ్యను వాళ్ళింటి దగ్గర దించి వెళతాడు కిరణ్ సంధ్యకు దగ్గర కావాలనే ఉద్దేశ్యంతో కిరణ్ చేసే పనులు ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయ్! శశి ఎవరో అబ్బాయితో తిరుగుతుండగా చూసిన ప్రమీల చెప్తేగాని తన కర్తవ్యం ఏమిటో గుర్తుకు రాలేదు సంధ్యకి శశి ఎవరితోనో తిరగడం తన కళ్ళారా చూసిన సంధ్య నిశ్చేష్టురాలవుతుంది

ఇచ్చేశాను భోజనాల సమయంలో కూడా నేను ఏమీ మాట్లాడలేదు సాధారణంగా రాత్రిపూట మేమందరం కలిసే భోజనం చేస్తాం రౌండుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ తినటం అలవాటు ఈ రోజు నేను అమ్మ పక్కన కూర్చోవటం మూలాన శశి నాకు ఎదురుగా కనిపిస్తోంది శశినే పరీక్షగా చూస్తూ భోజనం చేస్తున్నాను మధ్యలో శశి తలెత్తి నాతో చూపులు కలవగానే చప్పున తల వంచేసుకుంది నేను శశిని ఏమీ అనలేకపోయాను

మర్నాడు విమల ఏదో కొనాలంటే నేనూ తనతో వెళ్ళాను తర్వాత ఇద్దరం బస్ స్టాప్ కొస్తుంటే విమల దారిలో కనపడ్డ సినిమా వాల్‌పోస్టర్లు చూస్తూ "ఓహోహో సంధ్యా! ఆ పిక్చర్‌లో హీరో యాక్టు చేశాడు ఏం చెప్పమంటావు నిజంగా నేను నా జన్మలో అలాంటి పిక్చర్ ఇంతవరకూ చూడలేదు నువ్వు మాత్రం తప్పకుండా చూడు నువ్వా హిందీ పిక్చర్ చూశావా అందులో అమితాబచ్చన్ ఎంతందంగా ఉన్నాడంటే సంధ్యా, ఆ రాత్రి నేను నిజంగా అసలు నిద్రపోలేదంటే నమ్ము ఏం ఫైటింగ్ చేశాడని" అంటూ మధ్య మధ్య నా భుజంమీద గట్టిగా దెబ్బలు వేస్తూ, కుదుపుతూ ఒకటే లెక్చర్ దంచేస్తోంది

నేను మౌనంగా వింటూ మధ్య మధ్య ఊ ఆ అంటున్నాను విమల నడుస్తున్నదల్లా టక్కున ఆగిపోయింది "అర్రే" అంటూ

"మళ్ళీ ఏ మొచ్చింది తల్లీ" అని నేను ఆగిపోయాను విమల చప్పున నా భుజం గిల్లి "సంధ్యా! ప్రేమనగర్ వచ్చింది" అంది ఆ మాటలంటున్నప్పుడు విమల మొహం కోటికాంతుల సంభ్రమంతో వెలిగిపోయింది నోరు తెరుచుకుని కళ్ళు విప్పార్చుకుని చూస్తోంది

విమల హఠాత్తుగా నా భుజం గిల్లటంతో నాకు ఒళ్ళుమండి "వస్తే వచ్చింది లేవోయ్ నన్ను గిల్లిచంపకు" అన్నాను

అబ్బే! విమల అసలు మనధోరణిలో ఉంటే గదా నా భుజం నొక్కిపెట్టి రెండడుగులు ఆ బోర్డు ముందుకు వేసి -

"వాట్ ఎ బ్యూటిఫుల్ అండ్ లవ్లీ పిక్చర్ ఓహ్ అయ్ హావ్ సీన్ టెన్ టైమ్స్ మార్వలెస్" అంది మైమరుపుగా

"అబ్బా!" నేను తల పట్టుకున్నాను

"నువ్వు చూశావా సంధ్యా! నేనైతే పదిసార్లు చూశాను ప్రేమ్‌నగర్ ఏం పిక్చర్ తప్పకుండా చూడాలి ఆదివారం వెళదామా" ఉక్కిరిబిక్కిరవుతూ అంది

"విమలా! తల్లీ నీకు దణ్ణం పెడతాను కాసేపు నీ రన్నింగ్ కామెంట్రీ మానేసి నడువు" అన్నాను కోపం తెచ్చుకుంటూ

"ఊ! పోనోయ్ ఇక్కడ నా ఉపన్యాసం వినే తీరిక ఏ పనికిమాలిన వాళ్ళకి ఉంది" అంది గుడ్లురిమి చూస్తూ ఇందాకటి నుండి మా ఇద్దర్నే ఆసక్తిగా గమనిస్తున్న ఆ బెల్‌బాటమ్ భామ, విమల అలా అనంగానే చప్పున వెళ్ళిపోయింది

"అయితే నేను పనికిమాలినదాన్నా" ఎగిరిపడ్డాను "అబ్బే నిన్ను కాదు ఇందాక ఆ గుడ్లపక్షి మనల్ని చూస్తుంటే అలా అన్నాను" అని

సర్దిచెప్పింది నిక్‌నేమ్స్ పెట్టటంలో మా విమల అఖండురాలు నేను విమల చేతిని పట్టుకుని రోడ్డు వైపు లాక్కెళ్ళాను

''ఇంతకీ నువ్వసలు నాతో ఆదివారం సినిమాకి వస్తావా రావా'' అంది పళ్ళు తుమ్మబంకలా పట్టుకుని

''రాను ''

''ఏం ! ఎందుకని ?''

''చూడాలని లేదు ''

''అయితే ఇదివరకు చూశావన్నమాట'' విమల ఉసూరుమంటూ అంది ఎందుకంటే ఎలాంటి పిక్చర్ కూడా నేను రెండోసారి చూడను నా కసలు అలవాటులేదు

''ఊహూ ! చూడలేదు'' అన్నాను నవ్వుతూ

విమల ఠక్కున ఆగిపోయి – ''ఏమిటీ ! ప్రేమ్‌నగర్ చూడనివాళ్ళు ఎవరైనా ఉన్నారా ! ఈ మాట నీ నోటినుండే వింటున్నాను'' అంది తన ఆశ్చర్యాన్ని కళ్ళల్లోను, కనుబొమలలోను ప్రదర్శిస్తూ

నేను నవ్వాను ''ప్రామిస్ నేను చూడలేదు'' అన్నాను చెయ్యి ఎత్తి తలమీద పెట్టుకుని

''ఛట్ ! నువ్వింత అడివిమనిషివి అనుకోలేదు ''

''నేనేం అడివిమనిషిని కాను ''

''కానంటే సరిపోతుందేమిటి నువ్వొట్టి జడపదార్థానివి ఒక్క సరదాలేదు ఒక్క సినిమా లేదు ఒక్క షికారులేదు ఒక్క ఫ్యాషన్ తెలీదు అమ్మమ్మలా ఉంటావు నువ్వసలు ఏ అడవిలోనో బ్రతకాల్సిన దానివి నా ఖర్మకాలి నా కొలీగ్‌వైనావు'' అంది నుదురు కొట్టుకుంటూ

విమల మాటలకి నాకు ఉడుకుమోత్తనం వచ్చింది విమల అది గమనించి నా భుజంమీద చిన్నదెబ్బ వేసి –

''నాకు ఎప్పుడూ ఒక అనుమానం వస్తూంటుంది సినిమాలు చూడకుండా నువ్వసలు ఎలా బ్రతగ్గలవు'' అంది

''నిక్షేపంగా బ్రతకటంలేదూ ''

''ఏమోనబ్బా ! వారానికి ఎట్‌లీస్ట్ ఒక్క సినిమా కూడా చూడకపోతే నా ప్రాణాలు నిలవ్వు వరుసగ వారంరోజులు అన్నం మానేయమంటే భేషుగ్గా మానేస్తాను కానీ, సినిమాలు మానమంటే నా వల్లకాదు'' అంది ఎడంచేత్తో నా భుజం గట్టిగా వత్తి పట్టుకుని కుడిచేత్తో నా కుడిభుజంమీద గట్టిగా దెబ్బవేస్తూ విమల ప్రక్కన ఎవరున్నాసరే వాళ్ళ ఒళ్ళు హూనం కావలసిందే ఆ మాట, ఈ మాట చెబుతూ భుజాలు వాయగొట్టేస్తుంది నేను గట్టిగా చెబుదామంటే అది రోడ్డు

విమల చేతుల్ని తోసేస్తూ ''మరి పెళ్ళయితే నీ శ్రీవారు ఒప్పుకోవద్దూ'' అన్నాను వెక్కిరిస్తూ

విమల తేలిగ్గా తీసిపారేస్తూ ''ప్చ్ ! అయినా మొగుడి మాట ఎవరు వింటారే తల్లీ నువ్వు సీతమ్మగారిలా అన్నింటికీ డూడూ అంటావేమోగానీ నేను ఛస్తే వినను నాకు సినిమాలు చూపించే మొగుడినే కట్టుకుంటాను'' అంది

''ప్చ్ ! ఆ మహానుభావుడు ఎన్ని జన్మల పుణ్యం చేసుకున్నాడో నీలాంటిదాన్ని కట్టుకుందుకు ఇక ఆయనకి దేవుడే దిక్కు జై ఆంజనేయా'' అన్నాను తమాషాగా నాకు ఆంజనేయస్వామి ఆరాధ్యదైవం ఏదైనా కష్టం వచ్చినప్పుడు ''జై ఆంజనేయా '' అనటం అలవాటు

విమల పకపక నవ్వుతూ నా భుజంమీద గట్టిగా చరిచిందీసారి నేను ఉలిక్కిపడ్డాను పిప్పు చుర్ మనటంతో ఛర్రుమన్నాను

''నీ సినిమాల పిచ్చి తగలెయ్య సినిమాలు, హీరోలు అంటూ ఆ హీరో ఏం ఫైటింగ్ చేశాడే సంధ్యా అంటూ ముందు నా ఒళ్ళు వాయగొట్టేస్తున్నావు నన్ను చావగొట్టేస్తున్నావు'' అంటూ ఇంకా ఏదో అనబోతూ ఠక్కున ఆగిపోయాను నా కళ్ళు ఆశ్చర్యంతో వెడల్పయినాయి

ప్రక్కన విమల ''సారీ సంధ్యా'' అంటున్నా కూడా పట్టించుకోలేదు నిశ్చేష్టురాలిలా అడుగు ముందుకువేయటం మర్చిపోయినట్టు నిలబడిపోయాను ఎదురుగ్గా ఉన్న హోటల్లోనుంచి శశి, ఇంకో అతను చేతులు ఎట్టుకుని నవ్వుకుంటూ మాట్లాడుకుంటూ స్కూటర్ ఆపిన వైపు వస్తున్నారు

విమల నా భుజంమీద గిల్లి ''వాట్ ఎ బ్యూటిఫుల్ లవర్స్ ఎంత ముచ్చటగా ఉన్నారు ఆ అమ్మాయి మరీ బాగుంది కదూ'' అంది మెచ్చుకుంటూ నేను సమాధానం చెప్పలేదు మతిపోయినదానిలా చూస్తూండగానే వాళ్ళిద్దరూ స్కూటర్ ఎక్కి వెళ్ళిపోయారు శశి భుజానికి ఉన్న పుస్తకాలు పెట్టుకునే బ్యాగ్ నన్ను వెక్కిరిస్తున్నట్టు అటూ ఇటూ ఊగింది

''ఏయ్ సంధ్యా ! అదేమిటి అలా నిలబడిపోయావు'' విమల హెచ్చరించటంతో అయోమయంగా ఆమె మొహంవైపు చూశాను విమలకి ఇటువంటి విషయాలు అర్థం కావు ప్రతిదీ సింపుల్‌గా తీసుకుంటుంది

నేనలా శశి వాళ్ళని చూడటంతో కొంటెగా



ఇదీ సుమతి మనోక్షోభ !

ఆలోచనలతో ఎప్పుడో నిద్రపోయింది !

* * *

హాల్లో భర్త ప్రక్కన లేకపోయినా సుమతి ఆ సినిమాను చాలా ఆనందంగా చూడగలుగుతోంది

తన అభిమాన హీరోయిన్ ఎంత చక్కగా చేస్తోంది అబ్బా ! అంత వయస్సులోకూడా ఎంత అందంగా వుంది

సుమతి సినిమా చూస్తున్న టైమ్‌లో ఇక్కడ --

సుమతి భర్త వేణు స్నేహితుని ఇంట్లో ఆరుగురితో కలిసి మహా జోరుగా 'పేకాట' ఆడుతున్నాడు

అప్పుడే మరోసారి టీలు వొచ్చాయి వేణు టీ త్రాగుతూ, ఈసారైనా ఎలాగైనాసరే ఆట తిప్పాలనుకున్నాడు అప్పటికే నాలుగు కౌంట్లూ, రెండు మిడిల్ డ్రాప్స్ ఇచ్చాడు

ఇక్కడ —

సినిమాహాల్లో అప్పుడే 'విశ్రాంతి' వేశారు కొద్దిపాటి కాంతిలో తనకు తెలిసినవారెవరైనా వచ్చారేమోనని చుట్టూ చూసింది సుమతి

ఇంతవరకూ తన అభిమాన నటి ఎంత గొప్పగా చేసిందీ, ఎన్నెన్ని మంచి చీరలు కట్టిందీ వరుసగా ఎవరికైనా చెప్పాలని మహా ఇదైపోతోంది ఏం లాభం ? తెలిసినవారు ఒక్కరూ కనిపించలేదు అక్కడికీ వుండబట్టలేక ప్రక్కనున్నావిడిని —

"ఎలా వుందండీ సినిమా ?" అని అడిగింది

ఆవిడగారు సుమతిని ఎగాదిగా చూసి —

"బాగానే వుంది" అని అన్నది

"బాగానే ఏమిటండీ గొప్పగా వుంది చూశారా ఆ హీరోయిన్ ఎంత గొప్పగా చేసిందో "

ఆవిడగారు కళ్ళజోడులోంచి సుమతిని మరోసారి చూసి ఏం మాట్లాడకుండా వూరుకుంది

వేణు అందరికీ ముక్కలు పంచుతూ – 'జాక్‌పాట్ నాకు పడితే గ్యారంటీగా ఆట నేనే కొట్టేస్తాను' అని అనుకున్నాడు ముక్కలు పంచడం అయింది క్రింద వున్న ముక్కల్ని ఎత్తబోతూ వాచీ చూసుకున్నాడు ఎనిమిది గంటలు దాటింది అబ్బో ! ఇంకా ఫస్ట్ షో వదలడానికి చాలా టైముంది ! అని అనుకున్నాడు

వేణుకి జాక్‌పాట్ రాలేదుగానీ ఒక కలర్, ట్రిప్లెట్ పడింది ప్రక్కనున్న ఓ ఆఫీసరుగారు ముక్కలు పడేశారు వేణు క్రింద ముక్కని రెండో ట్రిప్లెట్‌కు ఎత్తుకుని ఆట ఆడాడు

ఈ ఆటను ఏమైనాసరే గెలుస్తాననే ధీమా వేణుకి బాగా వుంది

పేకాటకు ఆ మాత్రం ధీమా లేకపోతే మహా కష్టంగదా ?

కానీ, పాపం, వేణు క్రింద ముక్కకు వెళ్ళకుండా పేకలోకి వెడితే జాక్‌పాట్ వొచ్చేది !

జస్ట్ కొద్దిలో అతనికి అదృష్టం తప్పిపోయింది !

జస్ట్ కొద్దిలో ఇక్కడ హీరోయిన్‌క్కూడా అదృష్టం తప్పిపోయింది ఇకముందు ఏం జరగబోతోందో కూడా తెలియనంత సస్పెన్స్‌గా పిక్చర్ నడుస్తోంది

సుమతి వూపిరి బిగపెట్టింది ఏ క్షణంలోనైనా ఆమె కళ్ళనుంచి నీళ్ళు జారడానికి సిద్ధంగా వున్నాయి అంత పెద్ద హాల్లో వున్న జనమంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు !

హీరోయిన్ మాత్రం మహా బరువుగా డైలాగ్ చెబుతోంది కొన్ని వందల లీటర్ల కన్నీళ్ళు మాత్రం గ్లిసరిన్ సహాయంతో చెంపలమీదుగా జారిపోతున్నాయి

"ఛీ ! జాక్‌పాట్ కౌంట్ పడింది ఏమిటో ఇవేళ అన్నీ కౌంట్లే" అంటూ వేణు ఓకులు లెక్కపెట్టసాగాడు

"ఒక్కోసారి అంతే వేణు ఎంత మంచాటకైనా కౌంట్లు తప్పవ్" అంటూ తనూ ఓకులు లెక్కపెట్టసాగాడు ఓ బ్యాంక్ మేనేజరు

ఈ ఆట షో చేసి సినిమాహాలు దగ్గరకు వెడదామనుకున్నాడు వేణు కానీ, కౌంట్ ఇచ్చాడు! అంచేత, అతను అక్కడ నుంచి కదల్లేదు 'షో చెయ్యాలీ ఇక్కడ నుంచి కదలాలీ' అని అనుకున్నాడు సిగరెట్టు తీసి వెలిగించి, గట్టిగా దమ్ముపీల్చాడు

ఇదిగో, ఈ ఆట షో చేసి లేద్దామనుకుంటూనే టైమ్ గడిచిపోయింది ! ఎంతటైమ్ గడిచిందో తెలియలేదు !

అప్పటికి సినిమా వొదిలి పెట్టేయ్యడం, సుమతి బయటకొచ్చి ఒక మూలగా నుంచోవడం కూడా జరిగింది సినిమాకొచ్చిన జనమంతా వెళ్ళిపోయారు రెండో ఆటకొస్తున్న జనం కొద్ది కొద్దిగ వున్నారు

సుమతి, వొస్తున్న ప్రతిమనిషినీ తనభర్తే అనుకోసాగింది భర్త ఎంతకీ రాకపోవడంతో, వొస్తాడనే ఆశతో అలాగే ఎదురుచూస్తూ నుంచునే వుంది

ఇక్కడ వేణు ఇంకా ఆట షో చెయ్యలేదు కౌంట్లుమీద కౌంట్లు పడుతున్నాయి ఆట వ్యామోహంలోపడి భార్య సినిమా కెళ్ళిందనే సంగతే మరచిపోయాడు మళ్ళా మరోసారి టీలు వచ్చాయి వేణు టీ త్రాగుతూ ప్రక్కనున్న పెద్దమనిషిని టైమ్ అడిగాడు ఆ పెద్దమనిషి వేణుని ఓసారి చూసి పదకొండు దాటిందన్నాడు

అంతే ! వేణు ఒక్కసారిగా వులిక్కిపడి, భార్య సినిమాకెళ్ళిందనే సంగతి అప్పటికి గుర్తురాగా 'ఆట'వొదిలేసి గబగబాహాలుదగ్గరకుస్కూటరేసుకుని పరిగెట్టాడు

భర్త ఎంతకీ రాకపోవడంతో సుమతికి ఎక్కడలేని నీరసం వచ్చేసింది 'అసలీయన మనిషేనా' అంటూ విసుక్కుంది

జనం అంతా వెళ్ళిపోయారు రెండో ఆట మొదలుపెట్టడం వల్ల రిక్షాలు కూడా లేవు నలుగురైదుగురు వ్యక్తులు సుమతి ఏ 'జాతో' తెలియక ఆశగా అటూ యిటూ తిరగసాగారు

సినిమాహాలు నుంచి ఇంటికి నడిచి వెళ్ళాలంటే కనీసం అరగంట పడుతుంది హాలు దగ్గర రిక్షాలు లేవు నడిచి వెళ్ళకతప్పదు

సుమతి సినిమాహాలు ఆవరణలోంచి బయటకొచ్చి నడవసాగింది

హడావుడిగా హాలు దగ్గరకొచ్చిన వేణుకి భార్య కనిపించలేదు ఓసారి ఆవరణంతా కలయజూశాడు కలయజూసిన తర్వాత తనలో తానే నవ్వుకున్నాడు – ఐనా, ఇప్పటివరకూ భార్య హాలు దగ్గరవుంటుందని తనెలా అనుకున్నాడు ? తను రాకపోవడంతో చూసి ఇంటికి వెళ్ళిపోయి వుంటుంది

వేణు సిగరెట్టు వెలిగించి, స్కూటర్ స్టార్ట్ చేసి మళ్ళా పేకాట గృహానికి బయలుదేరాడు

సుమతి ఓ ఫర్లాంగుదూరం నడిచి వచ్చిందో లేదో హఠాత్తుగా కరెంటు పోయింది నడుస్తున్న ఆమె లిప్తకాలం ఆగి, మళ్ళా నడవసాగింది అసలే అమావాస్య చీకటి కావడం వల్ల ఎక్కడ ఏం వుందో తెలియడం లేదు ఐనా, సుమతి నడుస్తూనే వుంది

ముఖమంతా చెమట పట్టడం వల్ల పమిట కొంగుతో తుడుచుకుంది కాళ్ళు, చేతులూ వణుకుతున్నట్లనిపించింది ఎందుకో అకారణంగా గుండె వేగంగా కొట్టుకోసాగింది బహుశా, ఆ చీకటిని చూసి భయంవల్ల కాబోలు అడుగులు తడబడుతున్నాయి ఎవరింటి తలుపైనా తట్టి ఈ రాత్రికి అక్కడ ఆశ్రయం పొందాలని ఆశించింది ఒకవేళ, తలుపులు తెరచినా, ఆ ఇంటివారు మంచివారైతే సరేసరి లేకపోతే

ఈ భావం రావడంతో సుమతి మరీ బిగుసుకుపోయింది భయంగా పెద్దగ అరవాలనుకుంది గొంతు పెగల్లేదు ఐనా, తనకు తానుగా ధైర్యం తెచ్చుకుని, తన అభిమాన హీరోయిన్ని గుర్తుకు తెచ్చుకుని నడవసాగింది !

"ఏయ్ ఎవరా వెళ్ళేది ఆగు "

ఆ ప్రశ్న వినబడ్డంతోనే సుమతి అడుగు ముందుకు వెయ్యలేకపోయింది రెండు ఆకారాలు మాత్రం దగ్గరకు రావడం తెలుస్తోంది

"ఎవరంటే మాట్లాడరేం ?"

అప్పటికీ సుమతి మాట్లాడలేకపోయింది

"లైటు వెయ్యరా "

బ్యాటరీలైటు వెలిగింది

ఆ వెలుగులో తలొంచుకుని నిలబడిన ఒక స్త్రీని చూడగానే ఆ ఇద్దరి వ్యక్తులూ మహదానందపడిపోయారు

"ఇంత రాత్రి ఎక్కడనుంచి వస్తున్నావ్ ?"

"సినిమాకెళ్ళి "

"ఇప్పుడా సినిమా వొదిలిపెట్టిందీ?"

"మావారు హాలు దగ్గర కొస్తానన్నారు ఇప్పటిదాకా చూసి ఆయన రాకపోతే ఇంటికి వెడుతున్నాను "

ఆ ఇద్దరు వ్యక్తులూ కిసుక్కున నవ్వారు

## రాజ(నాట)కీయం

నా కోసం అని నీకనిపించేలా
నే నటిస్తే అది నాటకీయం
నీ కోసం అని నీకనిపించేలా
నే నటిస్తే అది రాజకీయం

— గడ్డమణుగు గోపాలకృష్ణమూర్తి

'ఇవన్నీ మామూలు మాటలే మేం ఎప్పుడూ వినేవే ?' అని మనస్సుల్లో అనుకున్నారు

' మీకు పుణ్యముంటుంది దయచేసి నన్ను ఇంటి దగ్గర దిగబెట్టగలరా ?''

ఒక అబల, అర్ధరాత్రి సమయంలో ఇద్దరు రక్షక భటులను దీనంగా వేడుకుంటోంది !

''అవును మవ్వొక్కదానివే ఇంటికెళ్ళడం ప్రమాదం మీ ఇల్లెక్కడో చెప్పు దిగబెడతాం ''

ఆ మాట వినడంతోనే సుమతి హాయిగా ఊపిరి పీల్చుకుంది

ఈ చీకటిలో, ఒంటరిగా బిక్కు బిక్కుమంటూ ఇంటికి ఎలా వెళ్ళాలో తెలియక తల్లడిల్లిపోతున్న సమయంలో ఇద్దరు దేవుళ్ళు తనని రక్షించడానికొచ్చారు ! చెరోవేపు ఆ ఇద్దరూ నడుస్తూ వుండగా మధ్యన సుమతి నడవసాగింది

ఒక రాజకన్యను సకల రాజ లాంఛనాలతో వుత్సవానికి తీసుకెడుతున్న విధంగా సుమతి నడవసాగింది !

ఇప్పుడు తనకేం భయంలేదు ! హాయిగా, సుఖంగా ఇంటికి చేరుకోగలదు

ఇంతకుముందు ఎంత భయపడిందో, ఇప్పుడంత సంతోషపడుతోంది

'అయ్యో ! మొగుడుగారూ ! మీరు హాలు దగ్గరకు రాలేదనే కోపంతో ఇంతకుముందు మిమ్మల్ని అతిదారుణంగా ఒక తిట్టు కాకుండా తిట్టాను ఓ పతిదేవా ! నన్ను క్షమించండి మీరు హాయిగా తెల్లార్లూ 'పేకాడి' ఇంటికి రండి ' అని మనసులో అనుకుంది

## నడుస్తున్న చరిత్ర

నడుస్తోంది —

తాపీగా, రీవిగా, ఉల్లాసంగా

పదడుగులు వేసింది పది కాకపోతే పదిహేనడుగులు వేసిందో లేదో, సుమతి జడుసుకున్నట్టుగా వులిక్కిపడింది !

ఆ రక్షకభటుల్లో ఒక భటుడు సుమతి భుజం మీద చెయ్యి వేశాడు మరో రక్షకభటుడు ఆమె వొంటిమీద చెయ్యేసి ముఖాల కోసం ప్రాకులాడుతున్నాడు

సుమతి భయపడిపోయి కెవ్వున అరవబోయింది అప్పటికే ఆమె నోటిని మూసేశారు

తనకేం జరిగిందో తెలుసుకునేంతలో - అంతా జరిగిపోయింది !

* * *

తెల్లారుతుండగా వేణు ఇంటికొచ్చి, ఇంటికి తాళంవేసి వుండడం చూసి ఆశ్చర్యపోయాడు !

ఇంటి ప్రక్కనవారి నడిగితే —

''మీ భార్యాభర్తలిద్దరూ కలిసి ఎక్కడికైనా వెళ్ళారేమోననుకున్నాం మరైతే సుమతి ఏది ?''

అంటూ ఎదురుప్రశ్న వేశారు

ఈ మాట వినడంతోనే వేణు నిలువునా కంపించిపోయాడు కాళ్ళూ చేతులూ ఆడలేదు భార్య ఏమైందో తెలియక పిచ్చివాడిలా వెదకి తిరిగి తిరిగి చివరకు పోలీస్స్టేషన్‌కు వెళ్ళాడు !

* * *

నేరం చేయకపోయినా, చేసినట్టు సృష్టించి ఇది నిజమేనన్నట్టు అనిపించే విధంగా 'గాండి' చెయ్యడం సామాన్య విషయం కాదు !

కోర్టులోనూ, బయటా జనం విపరీతంగా వున్నారు ఒక యువతి బోనులో తలొంచుకుని నిలబడి వుంది

ఆమె పేరు – సుమతి

''పెళ్ళయ్ దాదాపు పదిహేను సంవత్సరాలు దాటినా పిల్లలు పుట్టలేదు పిల్లలు పుట్టలేదనే నెపంతో భర్తను అలక్ష్యం చేసి అనేకమందితో ఈ సుమతి తిరగడం మొదలు పెట్టింది

నిన్న రాత్రి ఒక విటుడుతో ఒక వేశ్యా గృహంలో వుండగా పట్టుబడిన ఈ సుమతికి ఏ శిక్ష విధిస్తారో, విధించవలసిందిగా కోర్టువారిని కోరుతున్నాను'' అంటూ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గారు ఏకధాటిగా చెప్పినమాట చెప్పకుండా వాదించారు

ఈ మాటలు సుమతి విన్నదో లేదో తెలియదు గానీ, అప్పటికే ఆమె బోనులో స్పృహతప్పి పడిపోయివుంది !

జనంలోంచి సుమతి భర్త —

''ఇదంతా కట్టుకథ వీళ్లంతా పన్నిన పన్నాగం మీరంతా దొంగలు'' అంటూ అరవసాగాడు

ఐనా, అతని మాటలు ఎవరికీ వినిపించలేదు ఎందుకంటే, వేణుని అప్పటికే పోలీసులు బయటకు లాగేశారు !

ఒక సామాన్య మనిషికి ఇదీ ఈ దేశంలో జరుగుతున్న న్యాయం !! ★

డిసెంబర్ 15
విడుదల

తెలుగుపత్రికా
ప్రపంచంలో జైత్రయాత్ర
సాగిస్తున్న ఆంధ్రభూమి-సినీపాఠక
లోకానికి అందించే మరో మణిహారం

ఆంధ్రభూమి
# సినిమా పత్రిక

చక్కని ప్రింటింగు, చక్కని కబుర్లతో
వారం... వారం...





'కోరుకున్న మొగుడు'లో శోభన్‌బాబు, జయసుధ, లక్ష్మి

'తల్లీ కొడుకుల అనుబంధం'లో కె. ఆర్. విజయ, జయప్రద



# సినిమా వి

## పుణ్యభూమి కళ్ళు తెరిచిందిలో కమలారాణి కంట తడి

రావు బహద్దూర్ రంగారావు సాయం సమయ విలాస విహారానికి బయలుదేరబోతున్నాడు ఆయన ఉత్సాహం చూసి ఎలాగైనా మాట్లాడాలని చాలా సేపట్నుంచి ధైర్యం కూడగట్టుకోడానికి ప్రయత్ని స్తోంది జమీందారిణి కమలారాణి చివరికి బీరువా లోంచి శాలువ తీసిస్తూ అంది "లంకంత కొంపలో బిక్కు బిక్కుమంటూ ఒక్కదాన్నే ఉండాలి ఈ జాగారాలు నేను చెయ్యలేను ఈరోజు నుంచైనా త్వరగా ఇల్లు చేరుకోండి "

రంగారావు ఏం మాట్లాడలేదు శాలువ అందుకుని ముడి వేసుకున్నాడు కమలారాణికి ఉక్రోషం ముంచుకొచ్చింది కాని, ఆడది ఏం చేయుగలదు ? స్వగతంగా అనుకోసాగింది "నా పిచ్చి గాని, నా కోసం మీ రాచకార్యాలు ఆపండి అమ్మాయిగార్ని పట్నం మాన్పించండి ఇద్దరం తోడుగా ఇక్కడే పడి ఏడుస్తాం " గొంతులో ఏడుపు జీరగా వినిపిస్తోంది

రంగారావు గిరుక్కున వెనుతిరిగాడు "నో! అమ్మాయిగారు చదివితీరాలి "

'ఎందుకు చదవాలి ? మీ వంశంలోగాని, మా వంశంలోగాని పెద్దమనిషి అయిన ఆడపిల్ల చదువులనీ చట్టుబండలనీ గడపదాటి బయట అడుగు పెట్టిందా ?"

"స్టాప్ దట్ నాన్సెన్స్! యూ సినికల్ సిల్లీ వుమన్! బ్రిటిషువారు మన ప్రభువులు. వారి అడుగుజాడల్లో నడిస్తే మనం వారికి దగ్గర అవుతాం ఇప్పుడు మన బాగు, దేశం బాగు వారి దయమీద ఆధారపడి ఉన్నాయి అండర్‌స్టాండ్ ? మరోసారి నా కళ్ళముందు తడి పెట్టకండి!" గర్జిస్తూ ఠీవిగా బయటకు నడిచాడు రంగారావు

రాణివాసం కన్నీరులో — సాయం సంధ్యల నీడల్లో చీకటి పులుముకోసాగింది

దేవదాసు కనకాల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చిక్కిన సత్యనారాయణమూర్తి, బడుగు విష్ణు మూర్తి నిర్మించే అరుణోదయ పిలిమ్స్ ఇంటర్నేషనల్ వారి "పుణ్యభూమి కళ్ళు తెరిచింది"లో శ్రీధర్, జీవా, సంగీత, సతీష్, దేవదాసు, మధు, రాళ్ళపల్లి, వంకాయల, జయదేవ్, శివకుమార్, శ్రీలక్ష్మి, విజయగౌరి పాత్రధారులు శ్రీశ్రీ, నెల్లుట్ల మాటలు, పాటలు రాశారు బి గోపాలం సంగీతం, భాస్కరరావు ఛాయ, రవీంద్రబాబు కూర్పు నిర్వహిస్తున్నారు నిర్మాణత సోమరాజు అల్లూరి

## శేషాలు -జి. వి. జి.

### రంగూన్ రాజా

"కడల్ మీన్‌గళ్" అనే విజయవంతమైన తమిళ చిత్రాన్ని వై. చిట్టిబాబు నిర్మాణతలో ఆలయమ్మన్ క్రియేషన్స్‌వారు పై పేరున తెలుగులో అనువదిస్తున్నారు. కమలహాసన్ (ద్విపాత్రలు), సుజాత, స్వప్న, అంబిక, సుకుమారి, వాగేష్ పాత్రధారులు. వేటూరి మాటలు, పాటలు రాశారు. గోవర్ధన్ సంగీతం, రామలింగం కూర్పుతో కె. నరసింహారావు సమర్పించే ఈ చిత్రానికి వై. వెంకటేశ్వరరావు నిర్మాత.

### ప్రేమ సంకెళ్ళు

శ్రీ విజయకృష్ణ మూవీస్ "ప్రేమ సంకెళ్ళు" చిత్రం షూటింగ్ సింగపూర్‌లో డిసెంబర్‌లో ప్రారంభమవుతుందని డైరెక్టర్ విజయనిర్మల తెలియజేశారు. ఆమె పుత్రుడు చి॥ నరేష్ సరసన నాయికగా నూతన నటి పరిచయం గావింపబడుతుంది.

## తొలి చిత్ర నిర్మాతతో తొలి ఇంటర్‌వ్యూ!

మన దేశంలో మొట్టమొదటిసారిగా నిర్మించబడ్డ నిశ్శబ్ద చిత్రం "హరిశ్చంద్ర". దీనిని 1913 లో దాదాసాహెబ్ ఫాల్కే డూండీ నిర్మించారు. ఆ చిత్రం విడుదలైన వెంటనే "కేసరి" అనే మరాఠీ దినపత్రిక అయనతో ఇంటర్‌వ్యూ జరిపింది. అందులోంచి కొన్ని భాగాలు —

ప్ర : భారతదేశంలో సినిమాలకు ఎలాంటి భవిష్యత్తు ఉంటుంది ?

జ : మొదట్లో కొంత కాలం 'కళ'గా భావించబడినా, రాను రాను ఇదో వినోద సాధనంగా కేవలం వ్యాపారం అవుతుంది.

ప్ర : మీ ఉద్దేశంలో సినిమా ప్రభావంతో ప్రజలు చెడిపోవచ్చా ?

జ : భారతదేశానికి విలక్షణమైన కొన్ని సంప్రదాయాలు, మర్యాదలు, ఆచారాలు ఉన్నాయి. పాశ్చాత్య ఆచార సంప్రదాయాలు ఇతర దేశాలకు పాకడం నాకు తెలుసు. పిల్లలూ, యువకులూ దురభిప్రాయం ఏర్పరచుకోకూడనటువంటి చిత్రాలు నిర్మించాలి. మన దేశంలో చిత్ర నిర్మాణం మీద కొన్ని ఆంక్షలుండాలి.

ప్ర : ప్రభుత్వం పరిశ్రమకు తోడ్పడాలంటారా ?

జ : అవును. అది వారి విధి అనుకుంటాను. పరిశ్రమ యొక్క ఆంతరంగిక వ్యవహారాల గురించి కొంత తెలిసిన వారితో బోర్డు ఏర్పాటు కావాలి. కొన్ని రక్షణలు కల్పించాలి. కొన్ని సుంకాలు ఎత్తివేయవచ్చు.

ప్ర : ఇలాగే చిత్రాలు నిర్మిస్తూపోతే ప్రజాదరణ దక్కుతుందంటారా ?

జ : కాలక్రమాన ప్రజాదరణ తగ్గుతుంది.

'బొబ్బిలి పులి' లో శ్రీదేవి, రామారావు



# సినిమా

## శంకరాభరణంకు స్వర్ణ ధ్వనిముద్రికలు

విఖ్యాత గాయని ఎం. ఎస్. సుబ్బులక్ష్మి తన కుమార్తె రాధతో కలిపి "జో అచ్యుతానంద జోజో ముకుందా" అన్నమాచార్య కీర్తనమ మధురంగా గానం చేసిన అనంతరం "ఆమె తంబురలో నేనూ ఒక తంత్రిని ఎందుకు కాకూడదూ — అనిపిస్తోంది నాకు. నాకు సంగీత శాస్త్రం తెలియకపోయినా సంగీతమంటే పంచ ప్రాణాలూ," అన్నారు డైరెక్టర్ కె. విశ్వనాథ్. అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన "శంకరాభరణం" చిత్రం రికార్డుల విక్రయం లక్ష యూనిట్స్‌ను అధిగమించిన సందర్భంగా ఎస్ ఇ. ఎ. రికార్డ్స్‌వారు గోల్డ్ డిస్క్ ప్రదానోత్సవాన్ని ఇటీవల భారీ ఎత్తున జరిపారు. ప్రముఖ రచయిత, సెంట్రల్ ఎక్సైజ్ కలెక్టర్ ఇచ్ఛాపురపు జగన్నాధరావు అధ్యక్షత వహించిన సభకు వ్యాఖ్యాతగా కొంగర జగ్గయ్య వ్యవహరించారు ఎం ఎస్ సుబ్బులక్ష్మి ద్వారా స్వర్ణ ధ్వనిముద్రికలు చిత్ర దర్శకుడు, సంగీత దర్శకుడు, గేయ రచయిత, గాయనీ గాయకులు, నిర్మాతకు అందజేయబడ్డాయి డాక్టర్ చిత్తూరి సత్యనారాయణ, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, నిడదవోలు నాగేశ్వరరావు ప్రభృతులు కూడా ఉపన్యసించారు.

## ఆర్. పి. ఫిలిమ్స్

"చంద్రమోహన్, చిరంజీవి, కవిత, నాగభూషణం, మిక్కిలినేని, త్యాగరాజు ముఖ్య పాత్రధారులు ఇంకో హీరోయిన్‌ను త్వరలోనే నిర్ణయిస్తాం," అన్నారు ఆర్ పద్మనాభం. ఈయన నిర్మించే ఆర్ పి ఫిలిమ్స్ తొలి చిత్రానికి రమేష్‌నాయుడు సంగీతం, కొండపనేని రామలింగేశ్వర రావు శిల్పం, ఆదుర్తి హరనాథ్ కూర్పు, జి సత్యం—శేషు సహకార దర్శకత్వం నిర్వహిస్తారు "డిసెంబర్ చివరలో సాంగ్స్ రికార్డ్ చేస్తాం జనవరి నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే విజయనిర్మల.


'డబ్బు! డబ్బు! డబ్బు!'లో రాజసులోచన

## చంద్ర సినీ ఆర్ట్స్ తొలి చిత్రం

'మా చిత్రంలో కృష్ణగారు త్రిపాత్రధారి," అన్నారు ఎస్ వి. సుబ్బరాజు ఈయన కథ, సమర్పణలో కలిదిండి విశ్వనాధరాజు నిర్మించే పై సంస్థ తొలి చిత్రం మొదటి షెడ్యూల్ నవంబర్ 4 నుంచి 14 వరకు జరిగింది జయప్రద, గీత, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సారధి, భీమరాజు వగైరా నటవర్గం. మోదుకూరి జాన్సన్, సత్యం, ఎస్. ఎస్ లాల్, బి చలం, రాధారెడ్డి, నాగేశ్వరరావు, నరసింహరాజు, సాయిని మహేశ్వర రావు తెరవెనుక కృషి చేస్తున్నారు "డిసెంబర్, జనవరి నెలల్లో 1 నుంచి 15 తారీఖుల వరకు తదుపరి షెడ్యూల్స్ ఉంటాయి ఫిబ్రవరిలో పాచ్‌వర్క్ పూర్తిచేస్తాం," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి చంద్రశేఖరరెడ్డి

'ప్రేమ నక్షత్రం'లో కృష్ణ, శ్రీదేవి


# సినిమా

## అల్లుడుగారు జిందాబాద్‌లో ముసుగు మనుషులకు ముష్టిదెబ్బలు

రిటైర్డ్ మేజర్ నూకరాజు (రమణమూర్తి) భవంతి అర్ధరాత్రి ఒక గదిలో వాసు (శోభన్‌బాబు) ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు కిటికీ బోల్టులు తొలగించి, చల్లగా ఇద్దరు ముసుగు దొంగలు లోనకు ప్రవేశించారు ఇనప్పెట్టె దగ్గరికి పోతూండగా టీపాయ్‌కి ఒక దొంగ కాలు తగిలింది ఆ చప్పుడుకు వాసు లేచాడు ఇనప్పెట్టె తలుపులు తెరవడానికి ప్రయత్నిస్తున్న ఆ వ్యక్తులను ఫెడేల్ ఫెడేల్‌మని తన్నాడు కాస్సేపటికి ఆ దెబ్బలకు తట్టుకోలేని పెద్ద దొంగ ఆయాసంతో "ఇదుగో ఆగవయ్యా! నేను చెప్పేది కాస్త వినవయ్యా ఈ ఇంటికి నువ్వు కొత్తవాడివే కదా? ఈ సిపాయోడి దగ్గర ఇనప్పెట్టెలో లక్షలు లక్షలు మూలుగుతున్నాయి నువ్వు గమ్మున ఉంటే, చెరో అయిదు లక్షలు పంచుకుందాం," అన్నాడు

"ఏమిటీ, అయిదిస్తావా?" అంటూ మెడమీద కొట్టాడు వాసు

గిరగిర తిరుగుతూ దబ్బున కిందపడ్డాడు దొంగ. ఆ గొడవకు గీత (గీత), ఆమె తల్లి తాయారు (శ్యామల) గాభరాతో అక్కడికొచ్చారు. దొంగను పైకి లేపి, ముసుగు తొలగించాడు వాసు. అదెవరో కాదు; మేజర్ నూకరాజే! మరొక దొంగ నూకరాజు అసిస్టెంటు.

గీత "నాన్నా!" అంటూ, తాయారు "ఏమండీ!" అంటూ ఆశ్చర్యంతో దగ్గరికొచ్చారు.

"ఇదేమిటండీ? మీ ఇంట్లో మీరు దొంగతనానికి రావడం ఏమిటి?" అడిగాడు వాసు.

"అదే నీకు పరీక్ష," అన్నాడు నూకరాజు.

"అదేం టెస్ట్ డాడీ?" అంది గీత.

"అవునమ్మా! ఇతను నిజంగా నీమీద ప్రేమతో వచ్చాడో - లేక నా డబ్బుమీది మోజుతో వచ్చాడో తెలుసుకోవాలని పరీక్ష పెట్టాను. ఇతను నెగ్గాడు... నీ నిజాయితీకి చాలా గర్విస్తున్నానోయ్, వాసూ! కాని, నువ్వుగనుక నిజంగా నా డబ్బుమీది మోజుతో వచ్చి ఉంటే, ఈపాటికి ఈ తుపాకీలోని గుళ్ళు నీ గుండెల్లోంచి దూసుకుపోయి ఉండేవి... ఊఁ... మీరిద్దరూ వెళ్ళి రెస్ట్ తీసుకోండి," అన్నాడు నూకరాజు. వాసు, గీత ఒకేవైపు వెళ్ళబోతూండగా "హాల్ట్! అమ్మాయ్, నీ రూమ్ అటు. వాసూ, నీ రూమ్ ఇటు," అంటూ దారి చూపించి, ఠీవిగా భార్యవైపు తిరిగాడు.

అందరూ నవ్వుకున్నారు.



'పక్కింటె అమ్మాయి'లో చంద్రమోహన్, జయసుధ



'కిరాయి రౌడీలు'లో మోహన్‌బాబు, వనిత, సువర్ణ

కట్టా సుబ్బారావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో, ఎం. రామకృష్ణారెడ్డి నిర్వహణలో ఎం. శ్యామలారెడ్డి నిర్మించే సుమన్ క్రియేషన్స్ "అల్లుడుగారు జిందాబాద్" చిత్రంలో శారద, మమత, సువర్ణ, సత్యనారాయణ, గుమ్మడి, పి. ఎల్. నారాయణ, కాకరాల, మోదుకూరి సత్యం ఇతర పాత్రధారులు. గొల్లపూడి, చక్రవర్తి, వేటూరి, వెంగయ్య, భాస్కరరాజు, నరసింహారావు, డి. చంటి ప్రభృత సాంకేతికవర్గం.

## చిత్తూరులో కిరాయి రౌడీలు

"చిత్తూరు జిల్లా తలకోనలో షూటింగ్ ముగించుకువచ్చాం," అన్నారు క్రాంతికుమార్. శ్రీ క్రాంతి చిత్ర యూనిట్ సభ్యులు దాదాపు రెండు వందలమంది అక్టోబర్ 20 నుండి నవంబర్ 1 వరకు ఔట్‌డోర్ షూటింగ్‌లో పాల్గొన్నారు. ఆ నిర్మాత ఇంకా అన్నారిలా: "ఆ లొకేషన్‌లో దాదాపు 250 అడుగుల నుండి దూకే జలపాతం ఎంతో మనోహరంగా ఉంది. జాంభారా కోయజాతి వారి స్థావరాలను అక్కడ ప్రత్యేకంగా నిర్మించాం. వాటి మధ్య జాంభారా నాయకునితో, మోహన్‌బాబుతో చిరంజీవి ఫైట్స్ చాలా థ్రిల్లింగ్‌గా పిక్చరైజ్ చేశాం. ఇంకా రాధిక, సువర్ణ, ప్రభాకరరెడ్డి, రావు గోపాలరావు, అత్తిలి లక్ష్మి పాల్గొన్న కొన్ని సీన్లు కూడా షూట్ చేశాం. ఇంకో రెండు పాటల వర్క్ మిగిలి ఉంది. డిసెంబర్ చివరి వారంలో రిలీజ్ చేస్తాం. మొత్తంమీద - ఆ తలకోన లొకేషన్‌లో తొలిసారిగా షూట్‌చేసే ఘనత మా డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డికి, కెమెరామన్ వెంకట్‌కే దక్కింది." శ్రీ క్రాంతి చిత్రవారి "కిరాయి రౌడీలు" చిత్రానికి సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం ఇతర హంగులు.



కె.సి.శేఖర్‌బాబు
సమర్పించు

నాగార్జున ప్రొడక్షన్స్

# పక్కింటి అమ్మాయి

ఈస్ట్‌మన్ కలర్

ఎ.సారధి ❋ కె.వాసు

చక్రవర్తి • సత్యానంద్ • ఎస్.గోపాలరెడ్డి • నాయని మహేశ్వరరావు



నైజాం శ్రీసాయికృష్ణ సీడెడ్ భాస్కర్ పిక్చర్స్

SAI KRISHNA ADS

# పాల్ నురుగల సైన్యం రావాలి! మురికిపై దాడిని చేయాలి!!




మురికి, జిడ్డు, మరకలపై పాల్ నురుగుల దాడి ప్రారంభం కానివ్వండి! పాల్ నురుగుల సైన్యాన్ని రంగంలోకి దిగనివ్వండి!! మురికి జిడ్డు మరకలతో అవి కలియబడడం చూడండి. వాటిని సమూలంగా నాశనంచేసి, తళతళలాడే స్వచ్ఛమైన తెల్లని బట్టలు మిగులుతాయి

మురికిని నాశనంచేసే కోట్లాది నురుగుల బుడగలు ఇముడ్చుకున్నదే— పాల్ డిటర్జెంటు బిళ్ళ.

ఉత్పత్తిదారులు:
అల్ట్రా మరైన్ అండ్ పిగ్మెంట్సు లిమిటెడ్
రాణిపేట, తమిళనాడు



శ్రీ సారధీ స్టూడియోస్

## రాధా కల్యాణం

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: బాపు

నిర్మాతలు జి.వి. ప్రసాదరావు, వి. శశిభూషణ్

నవయుగ




## పెన్సిళ్ళన్నీ ఆకారానికి సమానమే
## కాని ఈ రకం మట్టుకు దీర్ఘకాలం వ్రాస్తాయి.

# నటరాజ్ పెన్సిళ్ళు

గ్యారంటీ : చెక్కుతున్నప్పుడు విరగదు. ఎందుకంటే, దీని "బాండెడ్ లెడ్", మిగిలిన వాటి కంటె ధాటీగా పని చేస్తుంది. మరి పెన్సిల్ ఎంత తక్కువ విరిగితే అంత ఎక్కువ కాలం మన్నుతుందన్న విషయం మీకు తెల్సుకదూ !

BONDED LEAD HB ✱ NATARAJ ✱

గ్యారంటీ: అతి మృదువుగా, అతినల్లగా వ్రాస్తుంది. ఎందుకంటె, నటరాజ్ అసమానమైన లెడ్ ఫార్ముLA కలిగివుంది. మైక్రొనైజ్‌డ్ గ్రాఫైట్ మరియు క్లేల మిశ్రమము
ఇంకా, అతి ప్రత్యేకమైన శ్రేణిలో అప్సరా పెన్సిళ్ళు ! రాయుటకు, రంగులు వేయుటకు, డ్రాయింగుకు మరియు గ్లాస్ మార్కింగ్ ల కొరకు.

# నటరాజ్ దీర్ఘజీవంగల పెన్సిళ్ళు

హిందుస్థాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్ 79 పాల్టన్ రోడ్, బొంబాయి 400 001.

OBM/4080/TL

# చావనుగాక భావను



## గోవిందరాజు సీతాదేవి

పెళ్ళిపందిరిలో సందడి సందడిగా వుంది సన్నాయి మ్రోగుతోంది పురోహితుడి గొంతు బిగ్గరగా మంత్రాలు వల్లిస్తూ వినిపిస్తోంది స్నేహితురాలు పార్వతి పెళ్ళికి ఆహ్వానం అందుకుని వచ్చింది నిర్మల పందిరిలో అడుగు పెడుతూనే చుట్టూ కలయజూసి వధూవరుల వైపు కళ్ళు తిప్పింది వరుడు వధువు మెడలో మంగళసూత్రం కట్టటానికి లేచి నిలుచున్నాడు పార్వతి చెల్లెలు దుర్గ అక్క వెనక నిల్చుని పూవులజడని కాస్త పైకియెత్తి పట్టుకుంది వరుడు మంగళసూత్రం కట్టేస్తున్నాడు ఈ దృశ్యం యెంత మనోహరంగా వుంటుంది చూసే వారికి ? ఇంక ఆ వధూవరుల మనస్థితి యెలా వుంటుందో చెప్పటం కష్టం

నిర్మల స్నేహితురాలి వైపు ఆత్మీయంగా చూడసాగింది పార్వతి అదృష్టవంతురాలు తల్లి దండ్రులు యెన్ని సంబంధాలు చూసినా, వరులు యెందరు వచ్చి చూసి నచ్చలేదని వెళ్ళిపోయినా ఓ పెళ్ళికి వెళ్ళిన పార్వతిని చూసి యితను మనసిచ్చాడు నచ్చిందని తల్లిదండ్రులతో చెప్పి ఒప్పించి ఈ పెళ్ళి చేసుకుంటున్నాడంటే పార్వతిది అదృష్టం కదూ ! అలాగే తనకీ జరక్కూడదూ ! ఈ పెళ్ళికి వచ్చిన యిందరు యువకుల్లో యే ఒక్కరికైనా తను అందంగా వున్నట్లు కన్పించ కూడదూ ! అవుతుంది అయి తీరుతుంది తన చిన్నప్పుడు ఓ రోజు ఓ కోయవాడు అడుక్కోవ టానికి వచ్చి భిక్షం పెడుతున్న తన ముఖంలోకి చూసి చెప్పాడు –

చాలా అదృష్టవంతురాలివనీ, శ్రీమంతుడైన భర్త లభిస్తాడనీ ఆ మాటలు బాగా గుర్తు వున్నాయి అవి యదార్థం యెప్పుడో అయితీరతాయి అన్న ఆశ లోలోపల యెంతగానో వుంది తల్లి దండ్రులు యెన్ని సంబంధాలు వెతికినా, యెందరో పెళ్ళికొడుకులు వచ్చి చూసి పెదవి విరిచివెడుతూ అన్న మాటలు అసలు మర్చిపోయింది "ఏం చూసి చేసుకోం మీ అమ్మాయిని అందం అంతంతమాత్రం చదువా పదో తరగతి కట్నమా మూడు వేలకి మించి యివ్వలేరు అన్ని విషయాలూ నార్మల్‌గా వున్నాయి. లాభంలేదు." అంటూ వెళ్ళిపోతూ వుంటే తల్లిదండ్రులు తలలు పట్టుకుని బాధ పడుతూంటే తనుమాత్రం సంతోషించేది

"వాళ్ళ ముఖం అసలు నాకు రాసిపెట్టివున్న వాళ్ళు వీళ్ళు కాదు. నాకోసం యే రాజకుమారుడో దిగివస్తాడు రావాలి" అనుకునేది యిలా కాలం గడిచిపోతూనేవుంది. తనకి వయస్సు ఇరవై యేడు సంవత్సరాలు దాటుతూ వుంది యింకాయెవ్వ డొస్తాడబ్బా ! అని కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూసి చూసి విసుగు చెందుతోంది ఈ మధ్య పార్వతికి ఈ పెళ్ళి యిలా కుదిరింది అనగానే తనలో ఆశ మళ్ళా చిగురించింది ఈ పెళ్ళికి తప్పకరావాలని తహతహలాడింది తనకీ, చెల్లెలికీ వుమ్మడిగావున్న ఒకే ఒక సిల్కు చీరెని చెంబు ఇస్త్రీ చేసి కట్టుకుని మరి వస్తూంటే తల్లి విసుగ్గా చూసింది–

"ఆ చీరె అలా పాడుచేస్తే యెలాగే యే పెళ్ళికొడుకు వచ్చినా కట్టుకోవటానికి అదన్నా సరిగ్గా లేకుంటే యెలాగే" అరిచినట్టే అంది

"నలపకుండా నే చూసుకుంటానమ్మా త్వరగా తిరిగివచ్చేసి దాచేస్తాగా" అంటూ మెల్లగా చెప్పి ఇంట్లోనించి బయటపడింది రెండు కిలోమీటర్ల దూరం యెండలో నడిచి వచ్చింది చెమటలో వళ్ళు తడిసిపోయింది సిల్కు చీరె వంటికి అంటుకుపోతూవుంది రోజూ ముతకనేత చీరెలు వెలిసిపోయినవి కట్టుకుని కట్టుకుని బోర్ కొట్టేస్తున్న సమయంలో యెప్పుడన్నా ఈ చీరె కట్టుకోవల్సిన అవసరం ఒస్తే సంబరంగా వుంటుంది ఒంటిమీద ఈ చీరె మెత్తగా జారి పోతూంటే యేదో తెలియని సంతోషం కల్గుతుంది ఇది చూసి –

"ఎంత అల్ప సంతోషివే అక్కా" అంటుంది చెల్లెలు ధరణి

ధరణిది దూకుడు స్వభావం కాలేజీలో చేరింది కానీ జీతం కట్టలేక పోవటంతో చదువు ఆపి ఇంట్లో కూర్చుండిపోయింది దాని ఈడు వాళ్ళందరూ చక్కగా చదువులు సాగిస్తున్నారు నా కన్నా అదృష్టం కల్సివస్తే నాన్నని పౌరోహిత్యం మాన్పించాలి చెల్లెలిని చదివించాలి అమ్మ ఎప్పుడూ మనసుపడే గుంటూరు జరీ చీరె కొనాలి

"అమ్మా అక్షింతలు" అన్న మాటకి నిర్మల

పులిక్కిపడి ఆలోచనల్లోంచి తేరుకుని చేయిపట్టి పెళ్ళిపీటలవైపు చూసింది వరుడు పార్వతి మెడలో మంగళసూత్రం కట్టేసి భార్యమీద అధికారం హస్తగతం చేసుకున్న వాడిలా పార్వతి పక్కన కూర్చున్నాడు

నిర్మల సంతోషంగా అక్షింతలు వేస్తూ అనుకుంది —

'అప్పుడే పెళ్ళి అయిపోయిందా ?'

'అప్పుడే యేమిటండీ బాబూ మూడుగంటల నుంచీ తంతు జరుగుతుంటే '

తన పక్కనే నిల్చున్న ఓ యువకుడు చిన్నగా నవ్వుతూ నిర్మల ముఖంలోకి చూశాడు

నిర్మల సిగ్గు పడిపోయింది

ఖర్మ ! మనసులో అనుకోవల్సిన మాట పైకి అన్నందుకు

'మీరు ఆడపెళ్ళి వారి వైపు వారా ! మగపెళ్ళి వారి వైపువారా !'

అతను చనువుగా అడుగుతూంటే నిర్మల అతని ముఖంలోకి పరిశీలనగా చూసింది

''ఎందుకూ ?'' అంది

''ఎదురుప్రశ్నా ? భలేవారు మగపెళ్ళివారి తరఫు వారిలానేవున్నారు ''

అనుమానంగా చూస్తూన్నట్లు నటిస్తున్నాడని పసికట్టింది నిర్మల చిలిపిగా చూస్తూ అంది —

''మగపెళ్ళివారి తరఫే అనుకోండి ఏం చేస్తారు ?''

''ఏం చేస్తారూ అని మెల్లగా అడుగుతున్నారా! వారి తరుపువారే అయితే కుర్చీమీద కుర్చీ వేస్తాను కూర్చోండని బలవంతం చేస్తాను కాఫీ కావాలా, టిఫెను కావాలా అని మీరు కావాలన్నవన్నీ తెప్పిస్తాను ''

నిర్మల ఫక్కున నవ్వింది

''మీరు భలే అందంగా నవ్వుతూన్నారే !''

నిర్మల నవ్వు ఆపేసింది గుండె క్షణం దడదడలాడింది అయినా ధైర్యం తెచ్చుకుని అంది—

''ఆడపెళ్ళివారి తరుపునైతేనో ''

''చెప్పమంటారా !''

''యస్ ''

''చెప్పిన తర్వాత ఫీల్ కాకూడదు యెందుకంటే మీరెవరో నాకు రూఢిగా తెలియకున్నా చెప్పేస్తూన్నాను కనుక '' అని ఆగాడు

''ఫర్లేదు చెప్పండి'' అంటూ అక్కడే ఖాళీగా వున్న కుర్చీలో కూర్చుంది

''మీరు కూర్చున్న ఆ కుర్చీ లాక్కుపోతాను మరెవరో వచ్చారనీ కావాలనీ ''

నిర్మల నవ్వబోయి ఆగిపోయింది కాస్త కోపం తెచ్చుకుంది

''సారీ ! యింతకీ కాఫీ అందిందా మీకు ?''

''టిఫినే అందందే'' అనుకోకుండానే అనేసింది

''ఒక పని చెయ్యండి అలా వెళ్లి రెండు ప్లేట్లు వుప్మా పట్టించుకు రండి ''

''మీరు ఏ పెళ్ళివారి తరుపువారు'' అనుమానం ముఖంలో కన్పడనీయకుండా అడిగింది

'చెప్తాను తప్పకుండా చెప్తాను. కానీ మీరు ముందు టిఫెనూ, కాఫీ తెప్పించిన తర్వాత '

నిర్మల చుట్టూ చూసింది పార్వతి చెల్లెలు అందరికీ వుప్మాఆకులు అందిస్తోంది నిర్మలని చూసి పల్కరించింది

''నిమ్మీ యింత ఆలశ్యంగానా రావటం. టిఫెను తిన్నావా ?''

'లేదు' అన్నట్లు తల వూపగానే ఓ ఆకు నిర్మలకి యిస్తూంటే పక్కన వున్న అతను కళ్ళతో సౌజ్ఞ చేశాడు 'నా మాట మర్చిపోతున్నారు' అన్నట్లుగా

నిర్మల తన చేతిలోని వుప్మా ఆకు అతనికిచ్చి మరో ఆకు అందుకుంది పార్వతి చెల్లెలు నిర్మలనీ పక్కనున్న యువకుడినీ ఓసారి పరీక్షగా చూసి 'యెవరు ?' అన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించింది

నిర్మల యేమో అనబోతూండగా అతను 'కాఫీ కూడా చెప్పేయండి' అని మాట్లాడేశాడు

'పంపిస్తాను నిర్మలా ! భోజనం చెయ్యకుండా వెళ్ళకు' అంటూ పార్వతి చెల్లెలు వెళ్ళిపోయింది ఎవరో కాఫీ గ్లాసులు అందిస్తూంటే అతనే అందుకుని ఒకటి నిర్మలకిచ్చి ఒకటి తను తీసుకుని తాగేశాడు

నిర్మలకి కాస్త చికాకు అన్పించింది

'మీరు ఏ పెళ్ళివారి తరుపువారంటే చెప్పలేదు '

''అబ్బ ఆ విషయం వదిలేలాలేరు ఒక్క రెండు నిముషాల్లో వస్తాను'' అంటూ అతను త్వరత్వరగా బైటకి వెళ్ళిపోయాడు

పెళ్ళి అయిపోవటంతో వచ్చిన అతిధులు కొందరు వుండిపోయారు కొందరు వెళ్ళిపోయారు పందిరి సగం ఖాళీ అయింది నిర్మల పార్వతి దగ్గరకి వెళ్ళి శుభాకాంక్షలు చెప్పింది పార్వతి చిన్నగా నవ్వి వూరుకుంది భర్తకి యెందరినో పరిచయం చేస్తోంది కానీ నిర్మలని పట్టించుకోలేదు పెళ్ళికొడుకు తరుపు స్నేహితులు వస్తూన్నారు పరిచయాల తర్వాత వెళ్ళిపోతూ నిర్మల వైపు చూస్తూన్నారు

'ఆమె ఎవరు ?' ఒకతను ప్రత్యేకంగా అడిగాడు

'నా ఫ్రెండ్ నిర్మల'

'ఓ' అంటూన్న అతనివైపు పరిశీలనగా చూసింది నిర్మల

అతను అదేం పట్టించుకోకుండా తన వెనక వున్న మరో అమ్మాయిని తనకిగా తను పరిచయం చేసుకుని కబుర్లు చెప్పసాగాడు

నిర్మల వెనక్కి చూసింది

ఆ అమ్మాయి అందంగా వుంది ఇంగ్లీషులో తెగమాట్లాడేస్తోంది అందమైన బట్టలు వేసుకుంది ఒయ్యారాలు కురిపిస్తోంది అందువల్ల అందరి కళ్ళూ ఆమెవైపు వున్నాయి నిర్మలలో తెలియని నిరుత్సాహం చోటు చేసుకోసాగింది అక్కడనుంచి లేచింది భోజనాలవరకూ వుండబుద్ధి కావటంలేదు వెళ్ళివస్తాను అని చెప్పి పెళ్ళి యిల్లు దాటుతూ 'ఇందాకటి యువకుడు మళ్ళా కన్పిస్తే బాగుండు' అని పందిరి అంతా చూసింది కన్పించలేదు యెండలో నడుస్తూండగా వెనకనించి పిలుపు విన్పించింది

'నిమ్మీగారూ ఒక్కక్షణం '

నిర్మల వులిక్కిపడి తలతిప్పి చూసింది

అతనే ! తను వెతుకుతూన్నతనే తన మనస్సుని గంట క్రితం అయస్కాంతంలా ఆకర్షించిన అతనే క్షణంలో నిర్మల ఆలోచనలు అలా అలా సాగిపోసాగాయి అవి తియ్య తియ్యగా వున్నట్లుగా అనుభూతి కల్గించసాగాయి

'నిమ్మీ ! మీరంటే యెందుకో నా కిష్టం యేర్పడింది మరి మీకు ?' అని అతను అడిగి తీరతాడు సిగ్గుపడకుండా నాకూ అంతే ! అని చెప్పాలి నా తల్లిదండ్రులకి పరిచయం చెయ్యాలి



అలా పరిచయం చేస్తే అతను నన్నే పెళ్ళాడతా నంటే అమ్మా, నాన్నా యెంతో సంతోషిస్తారు!

మనసు కళ్ళెంలేని గుర్రంలా పరుగెత్తుతూంటే బుద్ధి మందలించసాగింది —

'ఆగు ఆగు అసలు అతనేం చెప్తాడో ముందు విను వివరాలు అడుగు'

నిర్మల ఆలోచనలు ఆపి 'ఏమిటి' అని అడిగింది మనస్సుని అదిమిపట్టుకుని, "మీ ఇల్లు యెక్కడ ?" అన్నాడు

'వస్తారా ?'

'రాను కానీ '

"నా అడ్రెస్ కావాలా? తప్పక చెప్తాను కానీ యింతకీ మీరెవరు ? మీ పేరూ, వూరూ "

"నా పేరు సూరిబాబు బికాం పాస్ అయాను కులం మీ కులమే వూరు అనకాపల్లి యింకపోతే "

"చాలు ఇంతకీ మీరేం వుద్యోగం చేస్తున్నారు? తల్లిదండ్రులున్నారా ?"

సూరిబాబు మామూలుగా మాట్లాడేవాడల్లా క్షణం ఆగిపోయాడు నిర్మల ముఖంలోకి పరీక్షగా చూశాడు

"మీకు ?" తడబడిపోయాడు

"మీ కు ?" నిర్మల ధైర్యాన్ని తెచ్చుకుంటూ అతని ప్రశ్న అర్థమైనదానిలా అంది

సూరిబాబులో గాభరా యెక్కువైంది

'నేను వెళ్ళివస్తాను' అంటూ వెళ్ళబోతూన్న అతన్ని ఆపి తన యింటి అడ్రెస్ చెప్పింది సూరిబాబు ముఖం పాలిపోయినట్లయింది, నిర్మల ముఖంలో కన్పించే కాంతి చూస్తూంటే

" 'వస్తాను' అంటూన్నారు నా ప్రశ్నకి జవాబు "

'అడ్రెస్ వుందిగా వుత్తరం రాస్తాను' వేగంగా వెళ్ళిపోయాడు

నిర్మల యింటికి వచ్చింది సంతోషంతో తలమునకలవుతూ సూరిబాబు వుత్తరం కోసం యెదురు చూడసాగింది రాలేదు నిర్మలలో ఆశ చావలేదు నాలుగు రోజుల తర్వాత నిర్మలకి వుత్తరం వచ్చింది సూరిబాబు దగ్గరనుంచే!

నిర్మల చెవుల్లో సన్నాయి మేళం విన్పించసాగింది రంగురంగుల కలలు కళ్ళలో కదులు

# చావనుగాక చావను

తున్నాయి వుత్తరం పూర్తిగా చదివేసరికి తల తిరిగిపోయింది

నిమ్మిగారూ!

మీ పూర్తి పేరు నాకు తెలియదు. అనుకోకుండా గమ్మత్తుగా నాకు మీతో పరిచయం అయింది మీ అమాయకమైన ముఖం నన్నాకర్షించింది. నిజమే మీరు నా గురించి యేవేవో వూహాలు పెంచుకునేలా వున్నారన్నది నా కర్థమైపోయింది దీనికి నా బాధ్యత యేంలేదు అనుకోండి అయితే ఒక్క నిజం మీకు చెప్పాలని అన్పిస్తోంది నేనో నిరుద్యోగిని మీకు చెప్పిన నా పేరూ వూరూ పచ్చి అబద్ధం నేను యెక్కడ పెళ్ళి జరుగుతున్నా ఆ రోజు వెళ్ళి మీలాంటి యెవరినో ఒకరిని పరిచయం చేసుకుని, వాళ్ళలో వాళ్ళలా వీళ్ళలో వీళ్ళలా నటించి, టిఫెనూ, కాఫీ, భోజనం తిని దొరికినది యేదైనా పట్టుకుని పారిపోవటమే వృత్తిగా గల దొంగబ్రతుక్కి అలవాటుపడిన నిర్భాగ్యుడిని ఆ రోజు మనిద్దరి మాటలూ ఓ ముసలాయన వింటూ నన్ను గమనించకుంటే మీకు యింకా తియ్యటి కబుర్లు చెప్పి ఏ అవకాశమైనా దొరికేవరకూ వుండేవాడిని కానీ నా ప్లానే పాడైపోయింది లాభంలేదని బైటపడిపోయాను మీ సాయంతో మరుసటి రోజు మరో పెళ్ళికి వెళ్ళి పట్టుబడి అత్తవారింటికి వచ్చేశాను ఈ వుత్తరం మీకు యెంతో కష్టంమీద అందేలా యేర్పాటు చేశాను నన్ను మన్నిస్తారు కదూ

ఓ మనిషి.

నిర్మల కళ్ళనుంచి ధారాపాతంగా నీళ్ళు కారటం చూసింది ధరణి 'అక్కా! ఏమిటే ఈ ఉత్తరం' అంటూ లాక్కుని చూసింది

నిర్మల వెక్కి వెక్కి ఏడుస్తూ వుండిపోయింది ధరణి అక్క వీపుమీద చెయ్యివేసి అనునయిస్తూ అంది —

'అక్కా! నీకు నేను చెప్పగలదాన్ని కాను కానీ ఆడపిల్ల పెళ్లికానంత మాత్రాన యింతగా దిగులు పడాలా! ఛీ ఛీ కళ్ళు తుడుచుకో' అని సముదాయించి తన పని చూసుకోసాగింది.

'అమ్మాయ్! అలావున్నావే ?' అన్న తల్లిదండ్రుల ప్రశ్నకి జవాబివ్వలేదు నిర్మల

* * *

నాలుగురోజులు అతిభారంగా గడిపింది నిర్మల నిద్రపోకుండా ఆలోచించి ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చింది అర్ధరాత్రి ధరణి మంచి నిద్రలోవుంది యేదో శబ్దం అయినట్లు విన్పించి మెలుకువచ్చి కళ్ళు తెరిచింది పక్కకి చూసింది నిర్మలలేదు

'అక్కా ! యెక్కడికెళ్ళావే ?'

అన్న పిలుపుకి, నెత్తిన కిర్సనాయిలు పోసుకుని నిప్పుపుల్ల గీసి వెలిగించుకోబోతూన్న నిర్మల చెయ్యి వణికి అగ్గిపుల్ల కిందకి జారిపోయి ఆరిపోయింది అరసెకండ్‌లో జారిపోయిన ధైర్యాన్ని కూడగట్టుకుని మరోపుల్ల వెలిగించింది

ధరణి అరుపులకి తల్లితండ్రి లేచారు ధరణి వున్న రెండు గదులూ వెతికి వంటగదిలోకి వస్తూ పరిస్థితి గమనించి నిర్విణ్ణురాలైంది మరుక్షణంలోనే ఒక్క పరుగున వచ్చి అక్కమీద పడింది

"ఏం చేస్తున్నావే పిరికి పందా! ఛీఛీ నువ్వు యింత పిరికిదానివా! ఆగు నిన్ను చావనీయను" అంచులు అంటుకుని మంటలు పైకిలేస్తున్న చేనేత చీరని లాగిపారేసింది ఆ లాగటంలో ధరణి రెండు చేతులూ కాలి బొబ్బలెక్కాయి

తల్లితండ్రీ వచ్చి నిర్మల చేయబోయిన అఘాయిత్యాన్ని చూసి భోరుమన్నారు

"అమ్మా నిమ్మీ! నేను ఆడపిల్ల పెళ్ళి చేయలేని అసమర్థుడినే అయినా యింత శిక్ష వేయాలని యెందుకనుకున్నావమ్మా "

ఆయన గొంతు బొంగురుపోయింది తల్లి గుండెలు బాదుకుంటూ రాగాలు తీయసాగింది ధరణి తల్లిదండ్రులని సమాధానపరుస్తూ అంది —

"ఆరవకండి నాన్నా, యిరుగూ పొరుగూ చేరతారు. అక్కకి యేం ఫర్లేదు" అంటూన్న కూతురి ధైర్యానికి విస్తుపోతూ చూడసాగాడు

"అమ్మా ధరణీ! అరవనమ్మా అరవను యేదీ నీ చేతులకి కాస్త మందు రాయనీయి"

"నా చేతులకి మందు అక్క రాయాలి దానివల్లనేకదూ నాకీ గాయాలు అది అక్కకిచ్చి మీరూ అమ్మ వెళ్ళి హాయిగా నిద్రపోండి మీకు




ఆ థియేటరు దగ్గిర మళ్ళీ పిక్‌పాకెట్ గాళ్ళు చేరి నట్టున్నారు! తూపడి నీ దగ్గిరుంచయోయ్ వెళ్ళి వాళ్ళ అంతు చూసొస్తా!






సాగర్

# వారికి చాలినంత లభిస్తున్నదని మీరు గట్టిగా చెప్పగలరా?






"మా డాక్టరుగారు హార్లిక్స్‌ను సిఫారసు చేసినప్పటినుంచి మా కుటుంబమంతా రోజూ హార్లిక్స్ తీసుకునేట్టు అలవాటు చేశాను.
మీరు కూడా మీ కుటుంబానికి హార్లిక్స్ ఇస్తున్నారా?"

చాలా మంది తల్లులు తమ తమ ఆహార పదార్థాలలో ఆరోగ్యానికి ఏవి మంచివో అవి చాలినంత లభిస్తుందో లేదో స్పష్టంగా చెప్పలేరు.

అందుచేతనే వారు హార్లిక్స్‌ను నమ్ముకున్నారు.

హార్లిక్స్ రోజూ క్రమం తప్పకుండా తీసుకున్నట్టయితే మీ కుటుంబానికి పుష్టికరమైన సంపూర్ణ ఆరోగ్యం చేకూరుతుంది.

ఎందుచేతనంటే, చిక్కటి పాలు, మాల్టెడ్ బార్లీ, గోధుమ పుష్కలంగా హార్లిక్స్‌లో ఉన్నాయి. అవే ప్రధాన పోషకాహారానికి మూలం.

హార్లిక్స్‌ను నిత్యం తీసుకోవటం ఎంతో మంచిది. మీ మనసులోని అన్ని చింతలనూ తొలగిస్తుంది.

## హార్లిక్స్-మంచి పుష్టికర మైనది







న్రిద రాదని నాకు తెల్సు, అయినా వెళ్ళమంటూ న్నాను యెందుకంటే అక్కతో యేకాంతంగా మాట్లాడాలి ''

తల్లీ తండ్రీ ధరణికి జవాబు చెప్పలేక మెల్లగా బయటికి వెళ్ళిపోయార్రు ధరణి గదిలోపల ఘడియ పెట్టి అక్క దగ్గరగా వచ్చింది

నిర్మల రెండు చేతులతోనూ ముఖం కప్పకుని భోరుమంది

''అక్కా! యేడుస్తున్నావా! ఛీ ఈ కాలం పిల్లలు యేడవకూడదక్కా నిజం అది రూలు ఏడ్పు మాని జవాబు చెప్పు ఎందుకు చావాలని అనుకున్నావ్ ?''

'' ''

''పెళ్ళి కాలేదనా ?''

'' ''

''ప్రేమిస్తున్నానంటూ యే వెధవా ముందుకు రాలేదనా ?''

'' ''

''పెళ్ళి కాకున్నా హాయిగా బ్రతకవచ్చునే ''

''ఆడపిల్లకి పెళ్ళే ముఖ్యం అది కాకుంటే జీవితం వ్యర్థం '' వెక్కిళ్ళమధ్య అంది నిర్మల

''ఇది యే సినిమాలో డైలాగు ? ఏ నవలలో డైలాగు ?'' ధరణి పకపకా నవ్వింది

నిర్మల ముఖం చిన్నబోయింది ధరణి శాంతంగా అంది –అక్కా! ప్రతి మనిషి జీవితంలోనూ అవసరమైనవీ అతి ముఖ్యమైనవీ చాలా చాలా వుంటాయి కాదనను కానీ ప్రస్తుత సమాజంలో యెందరికి కావల్సినవి అందుతూన్నాయి 'కొందరు అదృష్టవంతులకి అందటంలేదా ?' అని నువ్వు ప్రశ్నించవచ్చు ఏ విషయంలో చూసినా అదృష్ట వంతులకంటే దురదృష్టవంతుల శాతమే యెక్కువ ఈ కోవలోకే వస్తారు మనలాంటి సామాన్య కుటుంబాల్లో పుట్టిన ఆడపిల్లలు ఒప్పుకుంటావా! కావల్సినవీ కావాలనుకున్నవీ దొరకని ప్రతి వ్యక్తీ ఆత్మహత్యా ప్రయత్నం చేసుకుంటే యెవరికీ యే నష్టమూ వుండదు, గవర్నమెంట్‌కి జనాభా భారం తగ్గించిన ఘనత దక్కటం తప్ప ''

ధరణి గడగడా అనేస్తుంటే నిర్మల కళ్ళు తుడుచుకుంటూ చురచురా చూసింది

''నీకేం తెలుసే నా బాధ నాన్న నా పెళ్ళి చేయలేదు నా పెళ్ళి నేను చేసుకోలేను నా చావుతో ఈ సమస్యకి పరిష్కారం కుదురుతుందిగా ?''

## చావనుగాక చావను

''కాదు కానేకాదు నీ తర్వాత నేను లేమా నీలా నేను పెళ్ళి కాలేదని దిగులుపడి చావను చూడూ! నీలానే నేనూ ఆలోచిస్తే ఈసరికి మూడు అవకాశాలు వచ్చినా తోసిపారేసి బ్రతుకుతూన్నాను ఒకరు కాదు యిద్దరు యువకులు పెళ్ళి చేసుకుంటామని షికార్లకీ, సినీమాలకీ తిప్పి పిరికివెధవల్లా పారిపోయారు కాస్త బాధపడ్డాను అనుకో వాళ్ళు ప్రేమిస్తున్నాం అన్నా నేను యేమీ పోగొట్టుకోలేదు కనక యివాళిలా నిర్భయంగా తలెత్తుకుని తిరగ్గలుగుతున్నాను కాలేజీలో చేరినా చదువు సాగక మానవల్సివచ్చింది అప్పుడూ చావచ్చుగా నేనలా వూహించను పట్టుదలగా ఆ డిగ్రీ సంపాదించాలనే ప్రైవేటుగా పరీక్షకి కట్టాను పాస్ అయితీరతాను అక్కా! 'జీవితంలో ఎదురయే ఓటమిని విజయంగా మార్చుకునేలా కృషి చేయాలి' అని మా ప్రైవేటు మాష్టారు మరీ మరీ చెప్తుంటారు ఇదే మనసి ముందుకి నడిపిస్తుంది ఇంతేకాదు నేను వూరిమీద బలాదూరు తిరుగుతూన్నానని అమ్మా, నాన్నా, నువ్వూ తిడుతున్నా నే జవాబివ్వటంలేదు యెందుకో తెల్సునా ? నేనలా తిరగటంలేదు ఓ కుట్టు క్లాస్‌లో చేరాను ఇదివరకే కొంత వచ్చు కనుక నెల జీతంగా యిస్తాం–అంటూ వాళ్ళు నాకు ట్రైనింగ్ యిస్తున్నారు ఇప్పుడు జీతం యెనభై తర్వాత మాటయాభై తర్వాత మూడు వందలు యిస్తామన్నారు ''

నిర్మల చెల్లెలివైపు ఆశ్చర్యంగా చూస్తూ అంది–

'నిజంగానా! ఈ మాట ఇంట్లో యెందుకు చెప్పలేదు '

''నెలజీతం తీసుకుని నా ప్రైవేటు మాష్టారి ఫీజు పోగా మిగతాది అంతా అమ్మకిచ్చి ఆశ్చర్యంలో ముంచాలని ''

''ధరణీ '' కళ్ళలో నీళ్ళు తిరిగినాయి నిర్మలకి

''అక్కా! యెవరి బ్రతుకుల్లోనూ యెప్పుడూ చీకటే వుండదు ఎటునించో ఓ కాంతి కిరణం ప్రసరించక తప్పదు ఈ ఆశతోనే మనలాంటి అమ్మాయిలు బ్రతుకులని ముందుకు సాగించాలి కృషి చేద్దాం ఫలితం కోసం వేచివుందాం ఏమంటావు? చూడూ రేపటినించీ నువ్వూ నా దారిలోకే రా వస్తావుగా ''

నిర్మల నోటినుంచి మాట రావటంలేదు

''అక్కా! నా మాటలు నచ్చకుంటే, నీవు కృషి చేసినా ఫలించకుంటే చావే, శాంతి నిస్తుందని నమ్మకం వుంటే అది నీ చేతిలోని పనేగా ''

''ధరణీ! మరోసారి అలా అనకు నేను యింతక్రితం ఆలోచించినది అంతా తప్పే ఇంక అలా ఆలోచించను నేను చావనుగాక ఛావను! పెళ్ళి జీవితానికి అవసరమే అయినా అది కుదరనప్పుడు దానికోసం మతి పోగొట్టుకోను నీలా నేనూ '' నిర్మల గొంతు బొంగురుపోయింది

''అక్కా చూశావా! గంటక్రితం నీ ఆలోచనకీ యిప్పటి నీ ఆలోచనకీ యెంత తేడా వచ్చిందో జీవితం అంటే యింతే '' అంటూన్న చెల్లెలిని గట్టిగా కౌగలించుకుంది నిర్మల

''అక్కా! తల్లీ దండ్రీ – అన్నా, చెల్లీ, స్నేహితులూ, ఆత్మీయులూ వగైరా వగైరా అందించే ఆత్మీయతతో కూడా బ్రతకవచ్చునేమో! కాదు బ్రతకవచ్చు ''

''కరెక్ట్ '' అంటూన్న పెద్దకూతురినీ, చిన్నకూతురినీ తలుపు సందుల్లోనించి చూసిన తల్లీదండ్రీ 'అమ్మయ్య, ఆ భగవంతుడు మనయందు వున్నాడు' అనుకున్నారు వారి కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి

''ఏమండీ! కాలం మనుషుల్లో మార్పుని తెస్తుందా !'' అంది తల్లి

''కాదు! అవసరాలు మనిషిలో మార్పుని తెస్తూన్నట్లున్నాయి'' అన్నాడు తండ్రి

'ఔరా ?' విస్తుపోతూ చూడసాగిందా ఇల్లాలు 

### కర్కట గర్భులు

ఈ నేలమీద పుట్టి
నీతి నిజాయితీల్ని పాతిపెట్టి
దేశభక్తులుగా చెలామణీ అవుతూన్న
ఈ మతకరి రాజకీయపు పాపములంతా
ముమ్మాటికీ
కర్కట గర్భులే!

— ద్వా. నా. శాస్త్రి

## కాఫీ రుచిని అధికంచేసే క్రొత్త తయారీ విధానము
## కాఫీ తాజాతనాన్ని అధికంగా సంరక్షించే క్రొత్త ప్యాకెట్

# క్రొత్త బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్




ఇప్పుడు బ్రూక్‌బాండ్ వారు ఉపయోగిస్తూన్న క్రొత్తతయారీ విధానంవల్ల క్రొత్త గ్రీన్‌లేబిల్ కాఫీ రుచి ఇదివరకు కంటే చాలా అమోఘంగా వుంటుంది అంతేకాదు బ్రూక్‌బాండ్ వారిచే ప్రథమంగా ప్రవేశపెట్టబడిన క్రొత్త కీప్-ఫ్రెష్ ప్యాకెట్ కాఫీపొడి అప్పుడే చేయించిన కాఫీపొడిలాగ చెమ్మ ఎక్కకుండా వారాలకొద్దీ ఎప్పటికప్పుడే తాజాగా వుంటుంది

# క్రొత్త గ్రీన్ లేబిల్

### అమోఘమైన రుచి విశిష్టమైన తాజాతనము
### (ఇది బ్రూక్‌బాండ్ వారు మాత్రమే చేయగలరు)

ఎన్నిక చేసిన కొన్ని పట్టణములలో మాత్రం లభించును.

OBM 7148 TG

# కోరిక తీరే వేళ

సీరియల్

చిన్నకోట సుశీలా దేవి



"ఇదేనమ్మా మా ఇల్లు!"

మాష్టారి మాటలో ఈ లోకంలోకి వచ్చింది శారద క్రగేటు తీసి లోపలికి వెళ్లారు శారద కూడా లోపలికి అడుగుపెట్టింది! ఇంటిముందు రకరకాల పూలచెట్లు ఆ చెట్ల వెనక బంగాళా పెంకులతో కట్టిన ఇల్లు

"కమలా!"

మాష్టారి గొంతు విని పిల్లలు బయటి కొచ్చారు! ఆయన దగ్గరకు రాబోయి శారదని చూసి ఆగిపోయారు!

"మీ అక్కయ్యరా!"

ఆయన ఆప్యాయతకే శారద మనస్సు ఆర్ద్ర మైంది!

ఇంట్లోకి వచ్చాక —

"కూర్చోమ్మా!" అని కుర్చీ చూపారు

శారద కూర్చుంది!

"మీ అమ్మ ఏదీ?"

"వంటింట్లో వుంది నాన్నా!"

ఆయన లోపలకు వెళ్లారు!

ఆయన తిరిగొచ్చేసరికి శారద చుట్టూ పిల్లలు చేరి ఏదేదో కబుర్లు చెప్పేస్తున్నారు

"చూడమ్మా !"

(గత సంచిక తరువాయి)

"నా పేరు శారదండి"

"శారదా! నువ్వు కాస్త చనువిచ్చావంటే నీ నెత్తికెక్కి తొక్కుతారు"

"ఏవిటి నాన్నా! మమ్మల్ని ఇలా ఇన్సల్ట్ చేస్తావ్"

శారద నవ్వింది!

మాష్టారు, పిల్లల్ని శారదకి పరిచయం చేశాడు! ఆయనకి ఇద్దరమ్మాయిలు, ఇద్దరబ్బాయిలు పెద్దమ్మాయికి పెళ్లయింది! అత్తవారింట్లో వుంది

తరువాత ఇద్దరబ్బాయిలు, ఆఖర్న ఆడపిల్ల! పిల్లలు ముగ్గురూ చాలా చక్కగా వున్నారు

"శారదా! స్నానం చెయ్యమ్మా! భోజనం చేద్దాం"

శారద లేచి స్నానం చేసి వచ్చింది అందరూ భోజనాలు చేశారు మళ్లీ హాల్లోకి వచ్చి కూర్చున్నారు

"మీరెళ్లి చదువుకోండి!" మాష్టారు పిల్లల్ని హెచ్చరించారు

"ఏవిటి నాన్నా! అక్కయ్య వచ్చిన రోజున కూడా చదువేనా! ఇవ్వాళ పాఠాలు కూడా రేపు చదువుకుంటాంలే!" చిన్నకొడుకు అన్నాడు

మాష్టారు నవ్వి వూరుకున్నాడు

అంతా నిశ్శబ్దంగా వుంది! చుట్టూ బాగా చెట్లున్నాయేమో గాలి వస్తున్నప్పుడు పెద్ద శబ్దం వస్తోంది

"ఇక్కడ ఒక్కళ్ళే వుంటారు గదా! మీకు భయం వెయ్యదా?" శారద అడిగింది

"భయమా! అదెలా వుంటుందక్కయ్యా!" చిన్నకూతురు నవ్వింది

మాష్టారు నవ్వుతున్నారు!

"అప్పుడప్పుడు నాన్న భయపడుతుంటారక్కయ్యా! మేము ధైర్యం చెప్తుంటాం"

"చాల్లేరా గొప్పలు!" మాష్టారు ప్రేమగా కోప్పడ్డారు

ఆ పిల్లలూ, వాళ్ల మాటలు వింటోంటే శ్రీధర్. బేబీ జ్ఞాపకం వచ్చారు శారదకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

"అక్కయ్యా! ఏవిటలా అయిపోయావ్?"

"అబ్బే! ఏంలేదు బాబూ!" వాళ్లు చూడకుండా కళ్లు తుడుచుకుంది

శారదవేపే చూస్తున్న మాష్టారు—"శారదా! ఒక్క మాట అడగనా?" అన్నారు

"అడగండి!"

"చిన్నారావు నీకు ఎలా తెలుసు! ఆయనేమన్నా నీకు బంధువా?"

శారద అసలు విషయం చెప్పింది

ఆయన ఆశ్చర్యపోతూ–"కిశోర్ నీ కొడుకా?" అన్నాడు

ఈసారి ఆశ్చర్యపోవడం శారద వంతయింది!

"కిశోర్ మీకు తెలుసా ?"

"ఆ! చిన్నారావు మాకు దూరపు బంధువు! అంతేకాదు మేమిద్దరం ప్రాణస్నేహితులమమ్మా!"

'అలాగా! అయితే నా కిశోర్! ఎలా వున్నాడండీ ? ! ఏం చదువుతున్నాడు ?" ఆత్రంగా అడిగింది శారద

ఆయన ఆ ప్రశ్నలకి సమాధానం చెప్పకుండా–

"చిన్నారావు చనిపోయాడమ్మా!" బాధగా అన్నాడు

"చిన్నారావుగారు చనిపోయారా! మరి బాబు ఎక్కడ వున్నాడండీ ?"

"చిన్నారావు పోయి మూడు నెలలయిందమ్మా! చిన్నప్పట్నించీ కష్టపడి పైసా, పైసా కూడబెట్టి ఆస్తిపరుడయ్యాడు అయినా జీవితంలో ఏ సుఖానికీ నోచుకోలేదు! అతని భార్య పదేళ్ల క్రితం చనిపోయింది. అప్పట్నించీ వున్న ఒక్కగానొక్క కొడుకు మీదే ప్రాణాలన్నీ పెట్టుకుని బ్రతికేడు కాని ఆ కొడుకు – ఇరవై ఏళ్లవాడు ఏక్సిడెంటులో చనిపోయాడు ఇన్ని దెబ్బలు తట్టుకుని నిలబడ్డాడు వాడికి ఒక్కటే దిగులుండేది తన తర్వాత ఈ ఆస్తిని అనుభవించేవాళ్ళు లేరే అని నేను వాడిని మళ్లీ పెళ్లి చేసుకోమని సలహా ఇచ్చాను కానీ వాడికది నచ్చలేదు అంకంత ఇంట్లో ఒంటరిగా కాలం గడుపుతుండేవాడు '

మాష్టారు బరువుగా నిట్టూర్చారు మాష్టారు ధోరణి శారదకి చిరాకు కలిగించింది కిశోర్ విషయం తెలుసుకోవాలని తనెంత ఆవేదన పడుతుంటే ఈయన బాబు సంగతి చెప్పకుండా, ఏవిటేమిటో చెప్తున్నాడు చిన్నారావు విషయం ఎవరిక్కావాలి!

ఆయన శారద చిరాకుని గమనించలేదు చిన్నారావుని తలుచుకుంటూ, ఆ జ్ఞాపకాల్లో మునిగి తేలుతున్నాడు

"శారదా! ఒకసారి చిన్నారావు గుంటూరు వెళ్ళి వచ్చేటప్పుడు పదేళ్ల కుర్రాడిని వెంటబెట్టుకు వచ్చాడు నాకు కబురు చేస్తే నేను వెళ్ళాను నాకా కుర్రాడిని చూపిస్తూ –

"వీడి పేరు కిశోర్! తల్లీ, తండ్రీ లేరు పెంచుకోడానికి తెచ్చుకున్నాను" అన్నాడు సంతోషంగా

నేను కిశోర్‌వేపు చూశాను

కిశోర్ చాలా బాగున్నాడు చిన్నారావుకి మంచి వారసుడు దొరికాడని సంతోషించాను

చిన్నారావు వాడికి ఇంటిదగ్గరే ట్యూషన్లు పెట్టించాడు కానీ నాకది నచ్చలేదు కిశోర్‌ని స్కూల్లో చేర్పించమని సలహా ఇచ్చాను

"ఆ! చదివి ఏం చేయాలిరా! వుద్యోగాలు చేయాలా! వూళ్లేలాలా! ఈ పొలాలూ, తోటలూ చూసుకుంటూ నా కళ్లెదురుగా వుంటేచాలు," అన్నాడు

ఏడాది గడిచింది

ఏడాదిలో కిశోర్ బాగా పాడవయ్యాడు ఎన్నెండేళ్లకే ఎదహారేళ్ళ కుర్రాడిలా వున్నాడు అందరూ వాడిని మెచ్చుకుంటూ వుండేవాళ్లం

మరో ఆరునెలలు గడిచాయి

ఒకరోజు చిన్నారావు నన్ను పిలిచాడు నేను వెళ్లాను ఆ రోజు నాడెందుకో చాలా విచారంగా వున్నట్లు కన్పించాడు

"కిశోర్ చెడిపోతున్నాడ్రా!" అన్నాడు దిగులుగా

"అంటే ?"

"ఏముంది! పేకాట, జూదం, సినిమాలు - ఒకటేమిటి అన్ని వ్యసనాలూ అలవాటయ్యాయి సీటికితోడు రౌడీలతో స్నేహం!"

"నేనప్పుడే చెప్పాను, వీడినిక్కడ వుంచొద్దని, కానీ నా మాట విన్నావా ?"

చిన్నారావు మాట్లాడలేదు

"మెల్లగా చెప్పి చూడరా" అన్నాను

"చెప్పాను కానీ నెమ్మదిగా కాదురా! చెప్పవలసిన విధంగా చెప్పాను" కోపంగా అన్నాడు

"అయినా నీకీ విషయం ఎలా తెలిసింది ?"

"ఇవ్వాళ పొద్దున వాడి స్నేహితుడు వచ్చి, కిశోర్ పేకాటలో ఓడిపోయిన డబ్బు ఇవ్వకుండా వారం రోజుల్నుంచీ తప్పించుకుంటున్నాట్ట 'ఇవ్వాళ మీరు డబ్బుఇస్తేగానీవెళ్లను' అంటూ కూర్చున్నాడు

**జరిగిన కథ — 4:** రకరకాల దొంగతనాలలో ఆరితేరిన ఓ కుర్రాడి మూలంగా భర్త శ్రీధర్, కూతురు బేబీ ఇద్దరూ ఆక్సిడెంట్‌కు గురికాగా వంటరిదవుతుంది శారద తర్వాత పోలీసులు ఆ కుర్రాడ్ని అరెస్ట్ చేస్తారు 'నీకు ఇంకో పాప వుంటే బావుండేది' అన్న పక్కింటి కమల మాటలకు, గతంలో ఓ నర్సుకు అప్పగించిన తన బాబు కోసం రాజమండ్రి బయలుదేరుతుంది రైల్లో ఆమె మనసు గతాన్ని తన కళ్ళ ముందుంచుతుంది శారద, నిరంజన్ ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకొని, పెద్దలతో మాట్లాడి పెళ్లి చేసుకోవాలని నిశ్చయించుకొంటారు తరచూ అతన్ని పార్కులో కలిసే శారద ఈసారి నిరంజన్ అర్థింపుతో అతని గది కెళ్లటానికి నిశ్చయించుకొంటుంది గది కెళ్లిన శారద నిరంజన్ వత్తిడులకు లొంగిపోతుంది తరచు ఇద్దరూ తమ కోరికలు తీర్చుకుంటుంటారు ఫలితంగా శారద గర్భవతి అవుతుంది త్వరలో పెళ్లి చేసుకుంటానని ఆమెకు హామీ ఇస్తాడు నిరంజన్ ఆ తర్వాత మళ్లీ కనిపించలేదు అలాను శారదకు పుట్టిన బిడ్డను నర్స్‌కి ఇచ్చేస్తుంది ఆమెతల్లి శ్రీధర్‌తో శారద కొత్త జీవితాన్ని ప్రారంభిస్తుంది శారద తన బాబుకోసం మరియమ్మ దగ్గరకు వెళ్తుంది ఆమె, డాక్టర్ రాఘవరావ్‌కి ఇచ్చేశానని చెప్పగా ఆయన దగ్గరకు వెళ్తుంది ఆయన తన స్నేహితుడు చిన్నారావ్‌కిచ్చానని చెప్పగా హైదరాబాద్ వెళ్తుంది చిన్నారావ్ వుండే పల్లెటూరికి వెళ్లడానికి ఏ వాహనాలూ లేక పోవడంతో ఆ రోజుకి స్టేషన్ మాస్టర్ తన ఇంటికి తీసుకెళ్తాడు

మొదట వాడంటున్నదేమిటో నాకర్థం కాలేదు అర్థమయ్యేసరికి నన్ను నేనే మరిచిపోయాను కోపాన్ని అణచుకుని వాడికి డబ్బు ఇచ్చి పంపాను ఇవ్వాళ కిశోర్ ఇంటికి వస్తాడుగా రానీ అంతు తేలుస్తాను" కోపంగా అన్నాడు

"చిన్నా! ఇప్పుడు కొట్టడం కాదు నువ్వు చెయ్యాల్సింది ఈ వయసులో కొడ్తే పిల్లలు ఇంకా మొండికేస్తారు! మెల్లగా చెప్పి చూడు" అన్నాడు

సరిగ్గా అదే సమయంలో కిశోర్ వచ్చాడు బట్టలు నలిగిపోయాయి జుట్టు రేగిపోయింది చిన్న సైజు రౌడీలా వున్నాడు

వాడు సమ్మల్ని చూడనట్లే లోపలికి వెళ్ళబోతుంటే చిన్నారావు పిలిచాడు కిశోర్ వచ్చి మా ఎదురుగా వున్న సోఫాలో కూర్చున్నాడు

"ప్రొద్దున్న మీ స్నేహితుడుగారు వచ్చారు తమరు పేకాటలో డబ్బు ఓడిపోయారుటగదా!"

"అవును! డబ్బు ఇచ్చెయ్యకపోయారా!" నిర్లక్ష్యంగా అన్నాడు కిశోర్

ఆ మాటతో చిన్నారావు రెచ్చిపోయాడు

"కిశోర్! తల్లీ, తండ్రీలేని అనాధవని, ఎంతో నెమ్మదిగా వుంటావని నిన్ను తెచ్చుకున్నాను కానీ నువ్విలా తయారౌతావని కలలో కూడా అనుకోలేదు"

కిశోర్ కళ్ళు ఎర్రబడ్డాయి

"అవును! నేను తల్లీ తండ్రీలేని అనాధని ఇక నాకు మంచి బుద్ధులు ఎలా వస్తాయి!" లేచి నిలబడ్డాడు

నేను ఏదో చెప్పబోయాను

"అనాధకి నీతిబోధలు ఎక్కువ! మీకు తెలీదా మాష్టారూ!" అని వెళ్లిపోయాడు

క్షణంసేపు మేమిద్దరం స్తబ్దుగా వుండిపోయాం

"చిన్నా! నువ్వామాట అనకుండా వుండాల్సిందిరా" అన్నాను

"ఏం అన్నాను వున్న విషయమేగా! వాడు అనాధకాడా! ఇక రేపట్నించీ వాడి చేతికి పైసా ఇవ్వను అప్పుడిక చచ్చినట్లు దారికి వస్తాడు" అన్నాడు

నేను మాటాడకుండా వచ్చేశాను

మాష్టారు ఆగారు

శారద, పిల్లలు, మాష్టారి భార్య అందరూ ఆయనవేపు ఆసక్తిగా చూస్తున్నారు

పిల్లలు సస్పెన్స్ భరించలేక

"ఆ తర్వాత ఏమయింది నాన్నా!" అని అడిగారు

"కిశోర్ ఇంటా బయటా దొంగతనాలు చెయ్యడం మొదలెట్టాడు దానితోపాటు నెలేసి రోజులు హైదరాబాద్ వెళ్లి జల్సాగా తిరిగొచ్చేవాడు దాదాపు మూడు నెలల క్రితం, స్నేహితుడికీ, అతడికీ తగాదా వచ్చి, కిశోర్ స్నేహితుడి తల బద్దలు కొట్టి పారిపోయాడు పోలీసులు అతనికోసం గాలించి చివరికి హైదరాబాద్‌లో పట్టుకున్నారు ఆ వార్త వినగానే చిన్నారావు తట్టుకోలేక గుండె ఆగి మరణించాడు"

ఆయన చెప్పడం ఆపి శారద ముఖంలోకి







చూశాడు శారద మెదడు బండబారిపోయింది పిచ్చిగా శూన్యంలోకి చూస్తూ కూర్చుంది

అది చూసి మాష్టారు శారద పడుకుంటే మంచిదనుకుని — 'అక్కయ్యకు గదిలో మంచం వెయ్యమ్మా' అని కూతురికి చెప్పాడు

ఆ అమ్మాయి వెళ్ళి మంచంవేసి వచ్చింది

"శారదా ! వెళ్ళిపడుకో తల్లీ !" మాష్టారు అన్నాడు

శారద నిద్రలో నడుస్తున్నట్లు నడిచి వెళ్ళి పడుకుంది

శారద మనసులో మాష్టారు చెప్పిన మాటలే మెదిలాయి

తన కొడుకుని పోలీసులు ఎత్తుకెళ్లారా ! తన కొడుకు దొంగా ! భగవంతుడా ! ఎంత దారుణమైన విషయం వింది తన కొడుకు ఏదో పెద్దచదువు చదువుతున్నాడనుకుని సంతోషిస్తోంది కాని తన కొడుకు దొంగ, జూదరి తను ఆ వూహే భరించ లేకుండా వుంది

ఇటువంటి కొడుకుని తీసుకుని తిరిగి ఈ ప్రపంచంలోకి వెళ్తే తనెన్ని హేళనల్ని ఎదుర్కోవాలో! అందరూ 'ఫలానావాడి తల్లి' అని తనని చూసి నవ్వుతుంటారు ఎక్కడికెళ్లినా అవమానాలు ఎదురవుతుంటాయి అవన్నీ తను భరించగలదా !

ప్రతి తల్లీ తన కొడుకు గొప్పవాడవ్వాలని కోరుకుంటుంది అందరూ తన కొడుకుని పొగడా లనుకుంటుంది తనూ అలాగే అనుకుంది తను కొడుకుని గర్వంగా అందరికీ చూపించాలనుకుంది కాని తన కొడుకు ఒక దొంగని అందరికీ చూప గలదా !

తను ఈ అవమానాలన్నీ భరించేకన్నా తన కొడుకుని ఇలా వదిలిపోవడమే మంచిది

ఇక కిశోర్‌ని మర్చిపోవడానికి ప్రయత్నించాలి అంతే !

ప్రక్కకు తిరిగి పడుకుంది శారద కాని, అలా నిర్ణయం తీసుకున్నా తృప్తిగా లేదు మనసులో ఏదో ఆవేదన ! ఏదో బాధ !

అంతరాంతరాల్లోంచి ఎవరో ప్రశ్నిస్తున్నారు 'నీ కొడుకు ఎందుకిలా తయారయ్యాడు ! దొంగ

## కోరిక తీరే వేళ

ఎందుకయ్యాడు ! ఎవరు దానికి కారకులు!'

అవును ఎవరు ?

"నువ్వే !" వేయి గొంతులతో ఎవరో అరుస్తున్నట్లనిపించింది

శారద చటుక్కున లేచి కూర్చుంది ఒళ్లంతా చెమటలు పట్టింది 'తనా కారణం ?'

"అవును !"

ఎవరా జవాబిచ్చింది !

లీల కళ్లముందు మెదిలింది

తన వేపు చూసి నవ్వుతోంది

'అవును ! నువ్వే ! తల్లి ప్రేమా, తండ్రి ఆదుపూలేని పిల్లలు ఇంకెలా వుంటారు కొడుకుని కన్నావు ! ఇక ఆ తర్వాత వాడిని గాలికి వదిలేసి నీ దారి నువ్వు చూసుకున్నావు వాడు తెగిన గాలిపటంలా ఎన్ని చేతులు మారాడో చూశావా ! మనిషి ఏ చిన్న కష్టం కలిగినా 'అమ్మా' అను కుంటాడు వాడు నిన్ను, ఎన్నిసార్లు తలుచుకుని వుంటాడో గదా ! మరియమ్మ దగ్గరా, డాక్టరుగారి దగ్గరా తిట్లుతిన్నప్పుడు, దెబ్బలు తిన్నప్పుడు ఎంత ఏడ్చివుంటాడో నువ్వు వూహించగలవా ! ఆ సమయాల్లో, – 'అమ్మా నన్నెందుకు కన్నావమ్మా ! ఇలా నిర్దాక్షిణ్యంగా నన్ను వదిలిపోకపోతే పుట్టగానే చంపకపోయావా !' అని ఎన్నిసార్లు అనుకున్నాడో !

కన్నూ మిన్నూ కానకుండా యవ్వనంలో విచ్చలవిడిగా తిరిగి సంతానాన్ని కని, ఆ తర్వాత పిల్లల్ని వాళ్ల ఖర్మానికి వదిలేసే నీలాంటి వాళ్లను నడిరోడ్డుమీద నిలబెట్టి షూట్ చెయ్యాలి

నీ కొడుకు దొంగ అని, వాడివలన నువ్వు ఎన్నో అవమానాల్ని ఎదుర్కోవాలని బాధపడు తున్నావు కానీ నీ కడుపున పుట్టినందుకు వాడు ఎన్ని అవమానాల్ని ఎదుర్కొన్నాడో ఒక్కసారి ఆలోచించావా ! వాడు అందంగా, ఆరోగ్యంగా పెరుగుతూ, చక్కగా చదువుకుంటూంటే 'నా కొడుకు' అని మురిసిపోతూ వాడిని తెచ్చుకునేదానివి కానీ వాడు 'దొంగ' అని తెలిసి వాడిని వదిలిపోవాలను కుంటున్నావు ! నువ్వెప్పుడూ స్వార్థ పరురాలివే !

ఆనాడు నీ భవిష్యత్తుకు అడ్డువస్తాడని వదిలేశావ్ ఈనాడు నీకు చెడ్డపేరు వస్తుందని వదిలేస్తున్నావ్! నీ కంటే దుర్మార్గులు, రాక్షసులు ఇంకొకళ్లు వుండరు !

అసలీ లోకంలో ప్రేమ, మమత, అభిమానం, జాలి ఏమీ లేవు !

అంతా దగా మోసం స్వార్థం ' లీల గొంతు పెద్దగా అరుస్తోంది

శారద వినలేక రెండు చేతుల్తోనూ ముఖం కప్పుకుంది

"అవును తను రాక్షసి దుర్మార్గురాలు! తను ఎంత సంకుచితంగా ఆలోచించింది కొడుకు తప్పుల్ని తల్లికాక ఎవరు క్షమిస్తారు ! తల్లి తప్ప ఇంకెవరు వాడిని గుండెల్లో దాచుకుంటారు !

కొడుకు ఎటువంటి వాడయినా తల్లికి వాడు కొడుకే ! ఆ కొడుకుమీద వున్న ప్రేమాభిమానాలు ఎప్పటికీ చెదిరిపోవు ! తన కొడుకుని తను తెచ్చుకుంటుంది వాడిని సక్రమమైన మార్గంలో పెడుతుంది వాడికనుంచీ మంచివాడయ్యేట్లు చూస్తుంది వాడికి విద్యాబుద్ధులు చెప్పించి గొప్ప వాడిని చేస్తుంది "

అలా అనుకోగానే శారద మనస్సు ప్రశాంతంగా అయింది

రేపు ప్రొద్దున్నే వాడెక్కడున్నాడో తెలుసుకుని వాడి దగ్గరకు వెళ్లాలి వాడిని దగ్గరకు తీసుకుని—

"బాబూ ! కిశోర్ ఇన్నాళ్లు నా వలన ఎన్ని కష్టాలనుభవించావ్ ! ఎన్ని బాధలు పడ్డావ్ ! పోనీలే అయిందేదో అయింది ! ఇక నేను వచ్చేశాను నీకే బాధ, కష్టం కలిగించనురా ! నిన్ను కంటి రెప్పలా చూసుకుంటాను !" నా తండ్రి ఆ జైల్లో సరైన తిండిలేక ఎంత చిక్కిపోయివున్నాడో అక్కడ ఎంత అవస్థపడుతున్నాడో !

తొందరగా తెల్లారితే బాగుణ్ణు మాష్టార్ని బాబు విషయం అడగొచ్చు – అనుకుంటూ ఉషోదయం కోసం ఎదురుచూస్తూ కూర్చుంది శారద

* * *

# కోరిక తీరేవేళ

విజయవాడలో ట్రైన్ దిగి రిక్షా మాట్లాడుకుని పిల్లల జైలుకి బయలుదేరింది

బయట గేటు దగ్గరవున్న వాచ్‌మన్ని "సూపర్నెంటుగారున్నారా ?" అనడిగింది

"ఆ సాబ్ ఇంకా రాలేదమ్మా !" అన్నాడు

"అలాగా ! ఎప్పుడొస్తారు ?"

"ఇంకో గంట పడుతుందమ్మా !"

అప్పటివరకూ ఏం చేయాలా అని ఆలోచిస్తూ నిలబడింది శారద అది చూసి వాచ్‌మన్ —

"మీరు లోపల రూములో కూర్చోండమ్మా!" అన్నాడు ఆ మాటతో తెప్పరిల్లింది

'అలాగే' అంటూ లోపలకు వచ్చి వరండాలో కుర్చీలుంటే అక్కడే ఒక కుర్చీలో కూర్చుంది

గంట తర్వాత వచ్చాడు సూపర్నెంటు

శారద లేచి నిలబడింది

ఆమెని చూస్తూ — "ఎవరు కావాలమ్మా ?" అనడిగాడు

"నా పేరు శారదండీ ! మీతో పనివుండి వచ్చాను"

"అలాగా రండి !" అంటూ ఆయన తన రూములోకి దారితీశాడు శారద వెనకే వెళ్ళింది

సూపర్నెంటు శారదకి కుర్చీ చూపి, తనూ కూర్చున్నాడు కూర్చున్నాక శారదవేపు చూసి —

"చెప్పండి" అన్నాడు

"నేను కిశోర్ తల్లినండీ ! కొన్ని కారణాల వల్ల వాడికి దూరమయ్యాను ఇప్పుడు వాడిని తీసికెళ్ళడానికి వచ్చాను నా బాబుని నాకిప్పించండి" ప్రాధేయపడింది శారద

సూపర్నెంటు రికార్డు తీసి కిశోర్ పేరుచూసి— దానికెదురుగా వాడిని గూర్చి వ్రాసింది చదివారు

"శారదగారూ ! మీ కిశోర్‌కి ఇంకా ఆరునెలలు వుంది శిక్ష ! అది పూర్తయ్యాక తీసికెళ్ళవచ్చు కానీ చూశారా ! వాడి వయసుకే ఎన్ని దొంగతనాలు చేశాడో !" అన్నాడాయన

శారద దోషిలా తలొంచుకుంది

సూపర్నెంటు రికార్డు మూసేస్తూ —

"ఆరునెలల తర్వాత రండమ్మా !" అన్నాడు

"అలాగేనండీ ! కానీ బాబుని ఒక్కసారి చూస్తానండీ ! అనుమతిస్తారా !"

"అలాగే ! రామ్మా ! చూపిస్తాను !" అని ఆయన కుర్చీలోంచి లేచాడు

శారద సూపర్నెంటు వెనకే నడిచింది పొడుగ్గావున్న వరండా దాటి హాలులోకి నడిచారు

అక్కడ రకరకాల పిల్లలు కన్పించారు

సూపర్నెంటు హాలుకి ఒక ప్రక్కగా వున్న మేడ ఎక్కాడు

శారద మనస్సులో కిశోరే మెదుల్తున్నాడు

కిశోర్ ఎలా వున్నాడో ! వాడిని త్వరగా చూడాలని హృదయం ఆరాటపడుతోంది

సూపర్నెంటు వెనకాలే గబగబా మెట్లెక్కుతోంది శారద పైకి వెళ్ళాక ఆయన ఎడమవేపున వున్న గదివేపు నడిచారు ఆ గది తలుపు వేసివుంది

సూపర్నెంటు ఆ గది తాళం తీశాడు

లోపలంతా చీకటిగా వుంది గది తలుపులు తీయిగానే తెల్లగా వెలుతురు గదంతా పరుచుకుంది ఎదురుగా పన్నెండేళ్ళ కుర్రాడు

అటువేపు తిరిగి నుంచున్నాడు అతడేనా కిశోర్ !

శారద మనస్సు దడదడలాడింది శరీరమంతా అదో విధమైన వుద్వేగంతో నిండిపోయింది

"బాబూ ! కిశోర్" అని పిలవబోయింది

కానీ కొడుకు కన్పించాడనే ఆనందంతో గొంతు పూడుకుపోయింది మాట పెగిలి రాలేదు



ఆంధ్ర కళాసమితి (తాతానగర్) వారు జరుపుకున్న ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం సందర్భంగా అమరజీవి పొట్టి శ్రీరాములుగారి చిత్రపటానికి నివాళులర్పిస్తున్న ముఖ్య అతిథి శ్రీ ఎస్ ఎల్ అగర్వాలా, సమితి కార్యదర్శి శ్రీ డి ఎస్ మూర్తిగార్లని చిత్రంలో చూడవచ్చు

ఇంతలో సూపర్నెంటు—'కిశోర్' అని పిలిచాడు

కిశోర్ వెనుదిరగలేదు

"కిశోర్" ఈసారి గట్టిగా పిలిచాడు సూపర్నెంటు

కిశోర్ వెనుదిరిగాడు

అతడివేపే చూస్తున్న శారద అతడు ఇటువేపు తిరగడంతో అతని ముఖాన్ని చూసి వులిక్కిపడ్డట్టయింది

ఇతడిని ఈ కుర్రాడిని — ఎక్కడో చూసింది

ఎక్కడా ?

చటుక్కున గుర్తుకు వచ్చింది

"ఎక్కడో ఏవిటి ?"

ఇతని ఫొటోనే పేపర్లో చూసింది

అయితే ఇతడు

శారద ఒళ్ళు చల్లబడిపోయింది ముఖం వెలవెలబోతోంది

ఇతడే తన భర్తని. తన బేబీని చంపిన హంతకుడు ! ఇతడివలనే తన శ్రీధర్, తన బేబీ తనని వదిలి వెళ్ళిపోయారు

ఇతడా ! తన కొడుకు ?

ఇతడా ! తన కిశోర్ ?

ఉహు ! కాదు ! కాదు !!

తన కొడుకు కాదు !!

తన కొడుకు పన్నెండేళ్ళక్రితమే చచిపోయాడు!

ఇప్పుడు తనకెవ్వరూ లేరు!

తను ఒంటరిది

(అయిపోయింది)



( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]




"ఏమండీ నాదొక్క కోర్కె" అంది మాలతి అప్పుడే బ్యాంకు నుండివచ్చిన తన భర్త ప్రభుకి తన ప్రేమానురాగాల్ని కరిగించినట్లు అత్యంత రుచికరంగా తయారు చేసిన లీఫ్ టీని విలువైన పింగాణి కప్పులోకి వొంపి నాజూకుగా అతనిచేతి కందిస్తూ.

"ఏమిటా కోర్కె" అన్నాడు ప్రభు దర్పాన్ని చిరునవ్వు వెనక దాచుకొంటూ, అమృతం లాంటి ఆ టీని ఆస్వాదిస్తూ, ఆవిడ కళ్ళలోకి చూస్తూ.

ఇప్పుడు మాలతి కాస దర్పం ప్రకటించింది సోఫాలో అతడి ప్రక్కనే కూర్చొంటూ అలవోకగా ముఖం పెట్టింది

"తీరా అడిగాక... కాదన్నుకదా!" అంది. ప్రభు తేలిగ్గా నవ్వేశాడా అర్థింపుకు...

"చెప్పుమరి? నీ కోర్కేమిటో తెలుసుకోకుండా ఎలా?" అన్నాడు

"అదేనండీ... అది కావాలి నాకు ఇవ్వరూ?" అంది అతడి చేతులవైపు కళ్ళు పెట్టి.

"అంటె."

"అంటే. ఇదుగో ఈ నీలం రాయి వుంగరం" అతడి చేతుల్ని తీసుకొంటూ ఎడంచేతి అనామికకున్న ఆ వుంగరాన్ని వేళ్లతో స్పృశిస్తూ అంది మాలతి.

ఎన్ని రోజుల్నుంచో అనుకుంటోంది మాలతి అతడి వేలికున్న ఆ వుంగరాన్ని అడిగి తను తీసేసుకోవాలని చీకట్లో అతడు ఆదమరచి ఈ లోకంతో పనిలేకుండా గాఢ నిద్రలో వున్నప్పుడు గుండెలమీద పెట్టుకున్న అతడి చేతికున్న రేడియం రిస్టువాచీ డయల్ కన్నా ఎన్నోరెట్లు నీలి కాంతితో మెరిసిపోతూ కనిపిస్తుందా వుంగరానికున్న నీలంపురాయి.

అతడు చిరునవ్వుతో తల అడ్డం ఆడించాడు

"అది చాలా ఖరీదైనది. నే నివ్వలేను మాలీ..."

"అంటే ప్రేమించి పెళ్లాడిన నా కంటే విలువైనదా అది??" రెట్టించి ఆక్రోశంగా అడిగింది మాలతి అతడి చేతుల్ని తోసేస్తూ.

"నీకంటే గొప్పది కాకపోవచ్చు. కానీ నా జీవితంలో మరువరానిది. ఒక స్త్రీ తన సమ్మతిపూర్వకం ఇచ్చిన విలువైన కానుక ఇది."

"ఓహో! ఒక స్త్రీ యిచ్చిన కానుకన్న మాట! ఎవరా స్త్రీ?!" ఆ పొంగిన ముక్కుల్లోంచి కళ్ళల్లోంచి ద్వేషం ఉవ్వెత్తున పొంగింది

"ఆవిడపేరు మాలతీ బరోడ్కర్" శాంతంగానే నవ్వుతూ అన్నాడు ప్రభు

"ఓహో!... ఆవిడ మరో మాలతన్న మాట" ఈర్ష్యతో జ్వలించిపోతూ అంది మాలతి. "అంటే నేనేకాక తమకు చాలామంది మాలతీలతో సంబంధ మున్నదన్న మాట!! అపర గోపాలకృష్ణులన్నమాట!"

అతడు ప్రశాంతంగానే నవ్వాడు. అనునయంగా ఆవిడ చెయ్యి తీసుకొని తనపక్కన చేర్చుకొని ఏదో చెపబోయాడు. కానీరక్కున విదిలించుకొందతని చెయ్యి ఒక్క విసరున గదిలోకి వెళ్లిపోయింది.

ఆశ్చర్యపోయాడు ప్రభు కొన్ని క్షణాల క్రితం ప్రేమాదరాలతో టీ అందిచ్చిన మాలతేనా ఇలా అయిపోయింది? అనుకొన్నాడు. ఆవిడ వెక్కడం స్పష్టంగా వినిపిస్తోంది.

# నిక్కమైన...నీలం

తనూ లేచి ఆమె వద్దకు చేరి ఎంతో ఓర్పుగ అనునయించి నచ్చచెప్ప ప్రయత్నించాడు.

"నా మాటలు విను మాలతి నీ కంతా చెబుతాను అంతా విన్నాక నువ్వేమన్నా పడతాను, కాస్త చెప్పేది విను"

"అయ్యయ్యో! ఇంకేమిటి చెప్పడం! స్పష్టంగా మీ నోటితోనే అన్నారు గా!" కన్నీళ్ళతో మొహమంతా నిర్రబారిపోయి ఆక్రోశిస్తూ అంది మాలతి.

"నా నోటితోనే నన్ను పూర్తిగా చెప్పనీమంటున్నాను లేదంటే నీ ఇష్టం!"

మాలతి అతన్ని ఈర్ష్యాద్వేషాలతో నిలువునా పరికించి చూసింది గదిలోకి వెళ్ళి వెంకటేశ్వరస్వామి పఠాన్ని తెచ్చింది.

"అయితే చెప్పండి ప్రమాణంచేసి భగవంతునిమీద! .." అంటూ సవాలు చేసింది!

అందుకు ప్రభు గంభీరంగా నిల్చొని తన చేతుల్ని పీఠానికి తాకించి అన్నాడు-

"ఈ భగవంతుని సాక్షిగా చెబుతున్నాను. నేనెలాంటి ద్రోహం చెయ్యలేదు."

* * *

ఆనాడు కడప ప్లాటుఫారం నుండి కదిలి అప్పుడే పరుగు లంకించుకొన్న బొంబాయి-మద్రాసు మెయిలును పరుగెత్తుకెళ్ళి క్యాచ్ చేశాడు భాస్కరరాజు ప్రభాకర్- అలియాస్-ప్రభగా అనే యువకుడు. అసలికి టైం లేదు! తొమ్మిదో తారీఖు తొమ్మిది గంటల కల్లా తనకు ఉద్యోగాన్నిచ్చిన బ్యాంక్ ఆఫ్ నాగపూర్‌కు హాజరై డ్యూటీకి జాయినింగ్ రిపోర్టివ్వాలి టైం చూసుకొన్నాడు ప్రభు పదకొండూ యాభై నిముషాలు. మరో పది నిముషాల్లో పన్నెండుగం- జీరో అవర్ నుండి ఎనిమిదో తారీకు ప్రారంభమవుతుంది తన కున్నది గట్టిగా ఇక ఒకే ఒక రోజు వ్యవధి. ఈ వొక్కరోజులోనే తిరుపతి వెళ్ళి తిరుమలేశుని దర్శించుకొని తిరిగి కడపకొచ్చి పెట్టె బేడాసర్దుకుని హైదరాబాద్ ప్రయాణమవాలి ఎటొచ్చీ తొమ్మిది ఉదయానికల్లా బ్యాంక్ ఆఫ్ నాగపూర్ ఆవరణలో వుండాలి. రెండు మూడురోజులు తనకు నిద్రుండదు- అనుకొంటూ నిలువెత్తు నిల్చొని అలసటతో "ఉష్" మంటూ ఒక్క నిట్టూర్పు విడిచాడు. చీకట్లో రైలు పరుగులు తీస్తోంది. జనం తొక్కిడి తొక్కిడిగా

నిల్చొన్నారు. ఎక్కడా సందులేదు. ఎలాగో అతికష్టంమీద లోనికి దూసుకొని వెళ్ళాడు ప్రభు. అంతా థర్డ్ క్లాసు ప్యాసింజర్లు. అది రిజర్వేషన్ బోగీ కాకపోయినా బెర్తులమీద బారాజాపుకుని పడుకున్నారు, రాజస్థానీ మార్వాడీలు. ఇలాకాదని మరికాస్త లోనికి వెళ్ళాడు ప్రభు అక్కడకూర్చొని నిద్రిస్తున్న ఇద్దరు రాజస్థానీలమధ్య ఎలాగో సర్దుకొని కూర్చోగలిగాడు. అమ్మయ్య అనుకొని తనూ కొద్దిసేపు తూగాడు. కాస్సేపటికి కళ్ళు మూతలుపడేవేళ రెండు పిల్లుల్లాంటి కళ్ళలోకి చూడాల్సొచ్చింది. ఎదురు బెర్తులో అరుపులు వినిపించి అటుకేసి చూశాడు. ఒక మేలిముసుగు వేసుకొన్న అమ్మాయిని ఆమె పక్కనున్న సింహబాలు వృద్ధుడు నెత్తిన మొట్టుతూ మరాఠీలో ఏదో గట్టిగా అరిచేస్తున్నాడు. చెయ్యెత్తుతున్నాడు.

తక్కిన ప్రయాణీకులంతా మంచి నిద్రలో వున్నా ఆ అమ్మాయి మాత్రం ఎవరైనా తనవైపు చూస్తున్నారేమోనని బాధపడి పోతూ - పౌరుషంతో పెదవులు బిగబట్టి ఆ ముసలివాడివైపు తిరగబడి చూసి ఏదో అనబోయి మళ్ళీ భయపడి రెప్పలు వాల్చి మౌనంగా ఉండిపోయింది. ఆవిడను ప్రభు పరిశీలనగా చూసి ''అబ్బ ! ఏం బ్యూటీ !'' అనుకొన్నాడు.

''ఆ సోగకళ్ళు ఆ కనుముక్కుతీరు ఏ రాజకుమారికో తప్ప ఇంకెవరికో సాధ్యం కాదు కదా'' అనుకొన్నాడు.

''భగవాన్ కళ్యాణచక్రవర్తి ! ఇంతగొప్ప అందాన్ని సృష్టించి ఇంతటి బాధకు గురి చేస్తున్నావు'' అనుకొన్నాడు. ఆవిడవైపు సానుభూతితో చూశాడు. ఆవిడ కూడా ముసుగులోంచి కళ్ళెత్తి ప్రభు వైపు దీనంగా జాలిగా చూసింది.

''అబ్బ ! అవి కళ్ళు కావు ఎగురుతున్న బంగారు చేపలు'' అనుకొన్నాడు ప్రభు.

ఆ వృద్ధుడు జందెంపోగు సవరించుకొంటూ మళ్ళీ అరిచాడు.

తను పడుకొంటాడు కానీ ఆవిడ్ని పడుకోనివ్వడు. పోనీ పడుకోవద్దు మేలుకుంటానంటే అదీ పడనివ్వడు. ఆవిడ అతడి పాదాల్ని సారి సారికీ కళ్ళకద్దుకోవాలట. భర్త ప్రత్యక్ష దైవమనుకోవాలట —

అతడి పాదాలవద్దే ఆ రొచ్చులో పడుకోవాలట. నా వల్ల కాదంటూందామ్మాయి.

మళ్ళీ చెయ్యెత్తబోతున్నాడతడు. చంపేస్తానంటున్నాడు—మరాఠీలో.

''ఎంత చిన్నవయసు రాకుమారిని ఆ ముసలివాడికిచ్చిచేశారు. గట్టిగా ఇంకో పదేళ్ళయినా బ్రతుకుతాడా ఆ వృద్ధుడు. ఇదేనా ఈ దేశం సాధించిన ప్రగతి'' అనుకున్నాడు ప్రభు. ''బహుశా ఆ వృద్ధుడు అపారధనవంతుడై వుండాలి. బోలెడు కన్యాశుల్కం ఎరవేసి ఆ లేత జీవితాన్ని కబళించి వుండాలి.''

ఆ అమ్మాయి చేసేదిలేక నేలమీద అతడి పాదాలవద్ద కూర్చొని ఓ మూట మీద తల వాల్చింది తనకు జరుగుతున్న అవమానాన్ని భరించలేక భారంగా మూసుకొంటున్నాయా కన్నులు. ఆ ముసలివాడు కసి తీరినట్టు రొప్పుతూ గర్వంగా బెర్తుపై కాళ్ళు జాపుకొని పడుకొన్నాడు.

ప్రభుకు నిద్ర దూరమైనా ఆవిడవైపు ఆదరంతో చూశాడు. ఆవిడది గమనించిందేమో ప్రభువైపు బరువైన పెద్దకళ్ళతో చూసింది. మళ్ళీ రెప్పలు వాల్చేసింది. ప్రభు అలాగే చూస్తున్నాడామెవైపు. ఆవిడ కళ్ళు వాల్చేస్తూంది. మళ్ళీ వుండివుండి ప్రభువైపు చూస్తూంది.

అలావాళ్ళ రెండు కళ్ళూ పరిభాషలాడుకొంటూ మళ్ళీ విడిపోతున్నాయి.

ప్రభు ఈసారి ఆవిడవైపుచూసి చిన్న నవ్వు నవ్వాడు. ''ఎంతటి నరకబాధ ననుభవిస్తున్నావు. నేనేంసాయం చేయగలను నాకు చెప్పు ?'' అన్నట్టుంది ఆ నవ్వు. ఆవిడ స్మితం విప్పారిన విశాలనయనాలతో ప్రభును చూసి నవ్వింది. ఆ నవ్వు వెనక అనేక బాధల్ని దాచుకొని మరీ నవ్విందామ్మాయి. ఆ ముసలివాడు నోరు తెరుచుకొని నిద్రలో పడిపోయాడు. అక్కడ మేల్కొని వున్నది ప్రభు, ఆ అమ్మాయి మాత్రమే.

ప్రభు బైటికి చూశాడు రైలు కోడూరు వదిలి చాలా సేపయిందేమో మామండూర్ అడవిమార్గంలో బోగీలను వూచిపారేస్తూ పరుగులు తీస్తూంది. ఎక్కడో పదహారు బోగీల అవతలున్న డీజిలింజన్ వంపులు తిరుగుతూ వుండి వుండి ఘీంకరిస్తూ పరుగు పెడుతోంది. ప్రకృతిని చీకటి ఏకపక్ష నియంతృత్వంలా పాలిస్తోంది. కాలం అర్ధరాత్రి అవలిభాగాన్ని అధిరోహిస్తోంది కిటికీ లోంచి ప్రభు తల యివతలికి లాక్కున్నాడు. బెర్తులమీద ప్రయాణీకులు రైలు వూపులకు మంచి నిద్రలో మునిగిపోయారు ఆ అమ్మాయి మాత్రం మూటమీద తల పెట్టుకు పడుకొంది. ప్రభుకు కనురెప్పలు బరువెక్కాయి. అతడికి తెలియకుండానే కునుకులోకి జారిపోయాడు.

అతడికి మెలకువొచ్చేసరికి రైలు రేణిగుంట ప్లాటుఫారం మీద నిల్చొనివుంది. బయట జనం తిరుగుతున్నారు. వెంటనే లేచాడు ప్రభు తన సూట్‌కేస్ తీసుకొని ఒక్క వుదుటున రైలు దిగేశాడు. అతడు దిగడమే ఆలస్యం అన్నట్టు రైలు కంపార్టుమెంటు దీపాల వెలుగుని జారుస్తూ వేగంగా వెళ్ళిపోయింది.



# నిక్కమైన...నీలం

కొంతదూరంలో ద్వారంవద్ద టిక్కెట్టు కలెక్టర్నుచూసి ఆగి తన ప్యాంటు రహస్యపు జేబులో వ్రేళ్ళుపెట్టి నోట్లమధ్య వుంచిన టిక్కెట్టును నేర్పుగా బయటికిలాగుతూ తన ఎదురుగా నిల్చొనినవ్యక్తివైపు చూసి ఆశ్చర్యపోయాడు ప్రభు

ఆవిడ ఆ రైల్లోని మరాఠీ అమ్మాయి. కమ్మటి పరిమళంతో మెరిసే మేలిముసుగులో దీనంగా నవ్వుతూ ఆశగా చూస్తూ నిల్చొంది. ఆ మేలిముసుగు పొరల్లో భారీగా మెరుస్తున్న జవారీ ప్రభు తననే చూశాక ఆవిడ బలంగా వూపిరి లాక్కొంటూ తల వొంచుకుంది. ఆ వర్చస్సుల్లోంచి గొప్ప సాహసం తెగింపూ కనిపించాయి! ప్రభు ఆశ్చర్యంలోంచి ఇంకా కోలుకోకుండానే నవ్వేస్తూ,

"క్యా ఆప్ వుతర్ గయే!" అన్నాడు.

"జీ హాఁ!" అందావిడ తలొంచుకునే. తర్వాత మరాఠీలో మాట్లాడిందేదో ప్రభుకు ఆ మాటలు అర్థమవలేదు ఇబ్బందిగా మొహం పెట్టాడు ఆవిడది గ్రహించి మళ్ళీ అదే మాటల్ని మరాఠీలో నొక్కి చెప్పింది ఆమె ఆ చేతుల సౌజ్ఞవల్ల,

"నేనిక్కడ మా వాళ్ళందర్నీ వొదిలి యిక్కడ దిగేను నీతోవచ్చేసాను" అన్నట్లు అర్థం చేసుకొన్నాడు ప్రభు

"టికెట్ హై క్యా" అన్నాడు సందిగ్ధంగా ఆవిడ మొహం పక్కకు తిప్పుకొని చిన్న నవ్వుతో "నా" అంది తర్వాత మరాఠీలో ఏదో అంది

"అన్నిట్నీ వొదిలి వచ్చేశానుకదా'! అన్న భావం స్ఫురించిందామె మాటల్లో.

నిజమే మరి అన్నీ వొదులుకుని తనతో వొచ్చేసిన మనిషి టికెట్నెలా తెచ్చుకుంటుంది అనుకున్నాడు ప్రభు ఎలాగో బయట పడ్డారు వాళ్ళు గంట నాలుగవుతోంది ప్రభు సందిగ్ధంగా యోచిస్తున్నాడు ఒక నిరుపమాన సౌందర్యవతి ఒంటిమీద భారీ నగలతో తనను నమ్మి వెంట వచ్చేసింది. తన భాష ఆవిడకు తెలీదు. ఆవిడ భాష తనకు తెలీదు కనీసం హిందీలోనైనా మాట్లాడదు. ఎలా ఇప్పుడు? ఈవిడ్ని తన వెంట తీసుకుపోవలసిందేనా! పోనీ తనకేం సంబంధమని వదిలేసివెళ్ళిపోతే అనుకొంటూ ఆగి వెనకే వస్తున్న ఆవిడవైపు చూశాడు. ఆవిడ ఏమిటన్నట్లు ఆశగా మొహం పెట్టి చూసింది ప్రభు మొహం మళ్ళీ తిప్పుకొని నడుస్తున్నాడు

"అలా చేస్తే ఈవిడ గతేం కావాలి! గూండాలు, దాదాలు ఈవిడ్ని పసిగడితే ప్రాణాలయినా దక్కుతాయా .. భగవంతుడు నన్ను క్షమిస్తాడా" అనుకొన్నాడు

"మరి ఈవిడ్ని నా వెంట తీసుకెళ్తే అమ్మకేం చెప్పాలి? . అన్నయ్యకు తెలిస్తే ఏమనుకొంటాడు! తనను ప్రేమిస్తున్న మాలతి విషయ ఎట్లా!... ఏమైనాకానీ అన్నిటికీ ఆ కళ్యాణ చక్రవర్తే నిర్ణయం చెబుతాడు" అనుకొన్నాడు

"ముందు ఈవిడతో తిరుమల వెళ్ళి స్వామి దర్శనం చేసుకొంటాను" అనుకొంటూ ఒక హోటల్ ముందుకెళ్ళి ఆమె వైపు చూస్తూ "ఆయియే" అంటూ లోనికి దారితీశాడు

ఆది యాత్రికులొచ్చే ప్రదేశం కాబట్టి, అక్కడ పగలు రాత్రి అంతా ఒకటే అయినా తెల్లవారడానికి యింకా చాలా వ్యవధి వుండబట్టి ఆ హోటల్లో జనం ఎవరూ లేరు ప్రభు ఆవిడ్ని బాగా లోనికి తీసుకొనిపోయి ఒక టేబుల్ వద్ద కూర్చొని ఆవిడ్ని తన పక్కన కూర్చోమన్నాడు ఆవిడొక చిన్న సంశయంపు నవ్వుతో పక్కన కూర్చోకుండా, ఎదురుగా కుర్చీలో కూర్చుంది ప్రభు నవ్వాడు.

ఇంతలో చెవిలో పెన్సిలు ముక్కతో సర్వరొచ్చినిల్చొని "ఎన్న వేణుం సార్" అన్నాడు. ప్రభు ఆవిడవైపు చూసి "క్యా లియేంగె. దోశ యా ఇడ్లీ" అన్నాడు.

ఆమె సిగ్గుతో తలొంచుకొని ఇబ్బందిగా మరాఠీలో ఏదో చెప్పకొంది అదేమిటో ప్రభుకు అర్థం కాలేదు ఒకవైపు సర్వర్ చూచాయగా వాళ్లను గమనిస్తూ నిల్చొన్నాడు ఆవిడ నీటొచ్చి నేనేమీ తీసుకోను అన్న భావాన్ని తన సౌజ్ఞల ద్వారా తెల్పుకొంది ప్రభు నవ్వుకొంటూ కళ్ళు మూసి తెర్చి రెండు కాఫీలు మాత్రం తెమ్మన్నాడతన్ని.

వారు తిరుమల వెళ్ళగానే ఆ హోటల్‌లో అన్న మాటల్ని మరో విధంగా అనడంతో అప్పుడర్థం చేసుకొన్నాడు ప్రభు– ఆవిడ "స్నానం చెయ్యనిదే నేను ఏమీ తీసుకోను" అన్నట్లు కి

వారు ఒక హోటల్లో స్నానం ముగించుకొని బయటికొచ్చేసరికి ప్రభుకి బాగా బడలికయింది. కొన్ని సాంబారు, పెరుగుపొట్లాలు తీసుకొని ఒక కాటేజి తీస్కొన్నాడతడు వాటిని ఆరగించాక "నేను కాసేపు రెస్ట్ తీసుకొంటాను మనకు టైమ్ లేదు" అంటూ బెడ్‌మీద మేను వాల్చాడతడు

అతనికి మెలకువయేసరికి మధ్యాహ్నం రెండు దాటింది ఆవిడ నిద్ర పోలేదు కుర్చీలో కూర్చొని తల వొంచుకొని యేదో యోచిస్తోంది, లేచివెళ్లి మొహం కడుక్కొచ్చి ఆమె ఎదురుగా కూర్చొన్నాడు అతడ్ని చూసి కాస్త సర్దుకొని కూర్చొందావిడ, రేగిన ముంగురుల్ని చేత్తోటి దువ్వుకొంది ఎంచేతి గాజుల్ని సవరించుకొంటూంది పమిటనిండా కప్పుకొంది తలమీదినుండి జారిన మేలి ముసుగునే అలా కప్పుకుందావిడ

ఆ సౌందర్య సోయగాన్ని చూస్తున్న ప్రభుకు క్షణాలమీద మనసు అదుపు తప్పుతూంది. ఆవేశంగా ఆవిడ చేతుల్ని తీసుకొంటూ "క్యా సోచ్ రహేహై..." అన్నాడు. గొంతు పొర అడ్డొచ్చింది.

ఆవిడ రెప్పలు వాల్చి కొద్ది క్షణాలు అలాగే వుండి చేతుల్ని నాజూకుగా వెనక్కు తీసుకొంది. ఏమీ లేదన్నట్లు తల అడ్డం ఆడించింది. ప్రభు మరొక్కసారి ఆవిడ చేతుల్ని తీసుకొని తృష్ణగానొక్కుతూ

"ఇధర్ దేఖియె... మేరే సూరత్" అన్నాడు. ఆవిడ రెండు క్షణాలతడి కళ్లలోకి చూసి నెమ్మదిగా చూపులు దించి అతడి చేతులో వున్న తన చేతుల్ని కదిల్చింది.

ఒకవైపు కోర్కె రేగుతున్నా మరోవైపు ప్రభును టైమ్ ఫ్యాక్టర్ హెచ్చరికచేసింది. పొరబాటున బాగా నిద్రపోయాననుకొన్నాడు. ఇప్పుడు కడపలో దిగి పెట్టె బేడా తీసుకునే వ్యవధి చాలా తక్కువ అన్నిటికన్నా ముఖ్యం రేపు తొమ్మిదింటికల్లా తన వుద్యోగస్థానంలో వుండితీరాలన్నది అలాంటప్పుడు తిరుపతి నుంచే నాలుగు గంట్లకు రాయలసీమ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరాలి మరి ఈ ఆవిడ వొస్తుందా తనవెంట.

"హమారా సాత్ హైదరాబాద్ ఆతే క్యా?" సందిగ్ధంగా నవ్వుతూ అడిగాడావిడ్ని. ఆవిడ రెండు మూడు క్షణాలు సూటిగా అతడి కళ్ళలోకి చూసి తల ఆడించింది. వెంటనే ఆవిడ చేతుల్ని వొదిలి లేచి నిల్చొన్నాడు ప్రభు, ఆవిడతో వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు.

*　　　*　　　*

ఆ వేళాశేషం రైల్లో రద్దీ ఎక్కువగా వున్నా హైదరాబాదుకు రెండు స్లీపింగ్ బెర్తులు తీసుకోగలిగి ఆవిడతో నెమ్మదిగా కూర్చొన్నాడు ప్రభు రైలు కదిలి వెళుతూంటే ప్రభు మనసంతా ఆవిడనాక్రమిస్తోంది. తన ననుసరిస్తున్న ఈ గంధర్వ సౌందర్యాన్ని దూరం నించి చూసి తృప్తి పడటమెలాగో అతడికి శక్యం కాకుండా వుంది

ఆవిడ సైతం అతడ్ని చూస్తోంది. నవ్వుతోంది కానీ ఆ చూపులూ నవ్వులూ జీవితంలో మరోసారి దొరకవేమోనన్నంత గొప్పగా వున్నాయి చేతులు తీస్కొంటే కాసేపు అలాగే అనుమతించి అదోలా నవ్వేస్తూ వెనక్కు తీసేసుకొంటోంది. ఆ నవ్వు చాలా అందంగా నవ్వేస్తోంది కానీ ఆవిడ భాషే అర్థంకాకుండా ప్రతిబంధకంగా వుంది.

కడప స్టేషన్ రాగానే భోజనాలు తెప్పించాడు ఏవో స్వీట్ పేకెట్స్ కొన్నాడు. ఇద్దరూ నవ్వులలో ఆరగించారు ప్రభు నవ్వ నవ్వుల్లోనే ఆవిడ వద్దు బాబా అంటున్నా బలవంతం చేసి ఆవిడ నోట్లో స్వయంగా స్వీట్సు పెట్టి తినిపించాడు.

"మీ పేరేమిటో తెల్సుకోవచ్చా" అందావిడ మరాఠీలో ప్రభుకు సులభంగానే అర్థమై తన పేరు తను చేరబోతున్న ఉద్యోగం చెప్పేశాడు రైలు బయలుదేరింది.

"మీరింత ఆదుకన్నారు నన్ను నా కృతజ్ఞతలెట్లా తెలియచెయ్యాలంటారు" అందావిడ ఆ భాషలోనే పైటనిండా కప్పుకుని చేతులు జోడిస్తూ.

జోడించిన చేతుల్ని తన చేతులో తీసుకొంటూ ఆవేశంగా

"మనం పెళ్ళాడేస్తాం హైదరాబాదులో వుండిపోదాం" అన్నాడు హిందీలో.

ఆవిడ అతడి కళ్ళలోకి ఒక్కనిముషం పాటు సాలోచనగా చూసింది. తల నెమ్మదిగా అడ్డంగా ఆడిస్తూ – గొప్ప కృతజ్ఞతా భావంతో

"నా" అంది తన భాషలో "నాకో సాయం చేస్తే జీవితంలో నిన్ను మరువలేను" అంది. ఏమిటన్నట్లు చూశాడు ప్రభు

"నన్ను మోసంతో డబ్బు తీసుకొని బలవంతంగా పెళ్లి చేశాడు మా నాన్న అదీ మా మారు– తల్లి ప్రోద్బలంతో నన్ను వదిలించుకునేందుకు మన్మద్‌లో మా అన్నయ్య ఫారెస్ట్ ఆఫీసర్‌గా వుంటున్నాడు.

## చీకటి వెలుగులు

తగాదాల సంధించి
సమాజానికి గురిపెడతా!
కుంతత్వం కవిస్తా
జాతుల్ని జోకొడతా!
మనుషుల్ని చీల్చేసి
మమత మాడ్చేస్తా
వెలుగంతామింగేస్తా
కాసుకోండి, చీకటిని
నే కటిక చీకటిని.
దృగంతాలు చేలాంచలం
సప్తసాగరాలు వల్కలం
ఆదిత్యుడు నా ఆభరణం
వ్యోమం నా శిరస్సు
లోకాలూ, గోళాలూ
నారూపాలు.
సత్యం నా కర్తవ్యం
సమత నా నైజం
– నే వెలుగుని.

– వి. వి. బి. రామారావు

# నిక్కమైన...నీలం

నన్నెలాగయినా మన్‌మడ్ రైలెక్కిస్తే నేను సరాసరి వెళ్ళిపోగలను అన్నయ్య దగ్గరికెళ్ళితే నాకింకేదిగులుండదు నాకెలాగయినా ఆ సాయంచేస్తే జీవితంలో నీ సాయం మరవలేను '' ఆవిడ తన భాషలోచెప్పినా నిదానంగా అర్థమయ్యేలా చెప్పుకొంది

''ఇంతేనా ! నువ్వెళ్ళిపోతావా !'' అన్నట్టు ప్రభు స్తబ్ధుడై చూశాడామెవైపు ఆవిడ అలాగే చిన్న పెదవుల వొణుకుతో ప్రభువే అర్థింపుగా చూస్తూ నెమ్మదిగా ప్రభు చేతుల్ని స్వయంగా తనచేతుల్లోకి తీసుకొంది కళ్ళలోకి ఆరాధనతో చూస్తూ మరాఠీలో కొన్ని మాటలు ఉచ్చరించింది

''నా భర్త నన్ను ఘోరంగా అవమానిస్తున్నప్పుడు నువ్వు నావైపు చూసిన చూపులోనే నీ ఔదార్యాన్ని ఔన్నత్యాన్ని గమనించాను అందుకే నీ వెంట సాహసించి దిగేశాను మరొకరి చేత నేనే పడివుంటే ఎంత అధోగతి పాలయి వుండేదాన్నో తల్చుకొంటే భయమవుతోంది నువ్వు నన్ను గొప్పగా ఆదరించావు నీ దయవల్ల బాలాజీ దర్శనం కూడా చేసుకొన్నాను నన్ను వివాహంకూడా చేసుకొంటానన్నావు .. కాని నావల్ల నీ వాళ్ళకు దూరం అవడం నే నొప్పుకోను నా వివాహం నిలాగూ అయిపోయింది. పునర్వివాహ ప్రసక్తి నాకు లేదు మా అన్నయ్య దగ్గరికి వెళ్ళిపోతాను ఆయన, నేను ఒకతల్లి పిల్లలం నన్ను తన ప్రాణంతో సమానంగా ప్రేమించేది మా అన్నయ్యొక్కడే...''

ప్రభు పసిబిడ్డలా బుంగమూతి పెట్టాడు. తన చేతుల్ని ఇవతలకి తీస్కున్నాడు. మొహం పక్కకు తిప్పుకొన్నాడు ఆవిడ అతడి గడ్డం పట్టుకొని మన్నితంగా ఇటు తిప్పుకుంది. ఆవిడ భాషలో—

''పోనీ నీకేంకావాలో చెప్పు... నా వొంటిమీది నగలన్నీ ఇచ్చేస్తాను...సరేనా ?'' అంది.

మొహం అడ్డం తిప్పాడు ప్రభు ''నహీ ! ...మై వో నా మాంగ్‌తే'' అన్నాడు.

''తో ... ఫిర్ ?'' అందావిడ నవ్వి ...

అతడు తన తృష్ణ తెలియబరుస్తున్నాడు.

వాళ్ళిద్దరికీ నిద్ర లేదా రాత్రి. రైలు హైదరాబాద్ సమీపిస్తూంది.

పొలాలమీది ప్రత్యూషపవనాలు చల్లగా ఓదారుస్తున్నాయి, వాళ్ళను.

చివరిసారిగా అతడి కోర్కె తెలుపుకొన్నాడు.

''ఈ పూట నాతో వుండిపో రేపు ఉదయం నిన్ను మన్‌మడ్ ట్రైనెక్కిస్తాను మనం హోటల్లో గది తీస్కుందాం''అన్నాడు పట్టుదలగా.

పసిబిడ్డ మంకుపట్టు పడుతుంటే ఓదార్పుగాచూసే తల్లిలా చూసిందావిడ అతడి కళ్ళలోకి—

''నీ యిష్టం అలాగే'' అంది. అతణ్ణి సూటిగా చూసింది.

''నీవల్ల భగవంతుడి దర్శనం చేసుకోగలిగాను, చక్కని ఆదరణ పొందగలిగాను. నన్ను మలినపరచాలన్నదే నీ వుద్దేశ్యమయితే ... అలాగేకానీ ..''

ఆ చివరి మాటలు వొణుకుతోపౌరుషంగా అంది.

ప్రభులో యోచన కల్గింది. బదులుచెప్పలేదు చాలా క్షణాలు. ఆవిడ అతణ్ణే నవ్వుతూ ఓదార్పుగా చూస్తూ లేచినిల్చొంది.

''బాగా యోచించుకో. టాయ్‌లెట్‌కెళ్ళొస్తాను'' అంటూ అతడి టవల్ తీసుకొని వెళ్ళిపోయింది.

పదినిముషాల తర్వాత బాగా మేకప్ అయి వచ్చిందావిడ అదేనవ్వుతోనే అతడి ఎదురుగా

## అవ్యవస్థ

చుట్టూ అలుముకొంటున్న చీకటిని
చెదరిపోతుందని, చైతన్యం వస్తుందని
వెలిగాకనబడే వెలుగును చూసి
సంబరపడిపోతున్నాడు సామాన్యుడు ...
పాపంపసివాడు ! కోపం తెలీని పిచ్చివాడు.
ఆ వెలుగు అవినీతికి పట్టం కట్టిన ప్రబుద్ధుడు
బక్కవాని కొంప కాల్చినప్పుడు వచ్చే, వెలుగనీ
సగటు మనిషిని శ్మశానంలో కాల్చుతున్నపుడు
మసక మసకగా పరిభ్రమిస్తున్న జ్వాలలనీ
తెలుసుకోలేని సామాన్యుడు వుంటూనే
వుంటాడు
పచ్చిపుండులా మండే సమాజంలో;
అవ్యవస్థలో...?

"సుచంద్ర"

కూర్చొంది రైలు గమ్యం చేరి ఆగబోతూంది

"ఏమిటి, ఏం నిర్ణయించుకొన్నావు..."

బదులు చెప్పలేదతడు.

రైలు ఆగేసింది వారిద్దరూ దిగేశారు. క్యాన్‌టిన్ వద్ద చాయ్ తాగుతూ ఆవిడ తన జాకెట్‌లోంచి కొన్ని పదినోట్లను తీసి అతడికిస్తూ "మన్‌వడ్ టిక్కెటొకటి తీసుకొంటావా ?" అంది అదే నవ్వుతోనే

మన్‌మడ్ ఎక్స్‌ప్రెస్ మరో అరగంటలోనే బయలుదేరబోతూ మరో లైనుమీద సిద్ధంగా వుంది

ప్రభు "వొద్దు వుంచుకో" అన్నాడు.

తనే వెళ్లి మొదటి తరగతి టిక్కెట్టు తీసుకొచ్చి ఆవిడ్ని ఒక ఖాళీ కంపారు మెంటులోకి తీసుకుపోయాడు.

రైలు కదలడానికింకా పది నిముషాల వ్యవధి వుందని మైకులో చెబుతున్నారు.

"నీ దయకు, నీ గొప్ప హృదయానికి కృతజ్ఞురాల్ని ప్రభూ!" అందావిడ.

అతడామె వైపు తృష్ణతో చూశాడు.

"నిన్ను చిరకాలం గుర్తు పెట్టుకునే ఒక్క కోర్కె కోరనా?" అన్నాడు చిలిపిగా నవ్వేస్తూ.

"ఏమిటి?"అందావిడ చిలిపిగానేనవ్వేస్తూ

"ఎవ్వరూ లేరిక్కడ... గాఢంగా ఒక్క ముద్దు పెట్టుకుంటాను నిన్ను .." అన్నాడు ప్రభు అంటూ ఆవిడ భుజాల్ని పట్టుకొని ముందుకుప కమించాడు కమ్మటిపరిమళంతో ఆవిడ నవ్వుతూనే కిలకిలారావంతో అతడ్ని వారించింది.

"అదుగో అదుగో ఎవరో వచ్చేస్తున్నారిటు" అంది

నిజంగా ఎవరూ లేరు.

ఆవిడతడ్ని వోదారుస్తూ కూర్చోబెట్టింది.

"నేన్నిన్ను రుణం వుంచ కొని వూర్కోపోనిస్తాననుకొన్నావా ప్రభూ! . ఇదిగో నా జ్ఞాపకార్థం ఈ నీలంరాయి వుంగరం" తన వ్రేలినుంచి తీసి చొరవగా అతడి అనామిక వ్రేలికి తొడిగిందావిడ ..

అతడు వద్దన్నాడు మొదట. ఆవిడ మళ్ళీ వారించింది.

"నువ్వుదీన్ని తీసుకోకపోతే నామీద ఒట్టే" అంటూ అతడి చేతిని దూరంగా వుంచేసింది.

అప్పటికే రెండు మూడు అనౌన్స్‌మెంట్లయి రైలు తిన్నగా కదిలింది

"అన్నట్టు నీ పేరు తెలుసుకోలేదు" అన్నాడతడు లేస్తూ

ఆవిడ కిలకిలా నవ్వేసింది మళ్ళీ

"సరిపోయె. ఇప్పుడైనా అడిగావు నాపేరు సంతోషమే!... నా పేరూ..." అంటూ మళ్ళీ నవ్వేస్తూ... "మాలతీ బరోడ్కర్" అంది

ప్రభు రైలు దిగేశాడు చేతులాడిస్తూ కిటికీలోంచి ఆ సౌందర్యదేవత వేగంతో దూరమైపోయింది పట్టపగటి నీరెండలో

* * *

తన భార్య మాలతికి ఎలా చెప్పాలో అలా చెప్పాడా నీలి వుంగరం వృత్తాంతాన్ని . మాలతి అతడి చేతిని వెచ్చగా నొక్కుతూ ఆ నీలిరాయి వుంగరాన్ని ముద్దెట్టుకుంది. వెంటనే మాలతీ లతలా ప్రభుని పెనవేసుకొంది.

# హైదరాబాద్ నోట్ బుక్

తిరుమల రామచంద్ర

**డాక్టరు వాసిని వెంకట లక్ష్మీ నరసింహారావు :**

పూజకొద్దీ పురుషుడు, దానం కొద్దీ పిల్లలు— అనేది మహిళల సామెత కొన్ని సంస్థలను చూస్తూ ఉంటే ఈ సామెత అన్వయిస్తుందేమోనని అనిపిస్తుంది ఉదాహరణకు తార్నాకాలోని ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయాన్నే తీసుకుందాం దానిపుణ్య మేమిటో, సంచాలకులు తరుచు మంచివారే వస్తున్నారు ఇప్పుడు కొత్తగా సంచాలకులైన డాక్టర్ వాసని వెంకట లక్ష్మీ నరసింహారావంతే తమ కర్తవ్యానికే కట్టుబడిపోయిన వారు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలోని ప్రాచీన జ్ఞానాన్ని ఆంధ్రావళికి అందజేయడానికి అహర్నిశం పథకాలు వేస్తుంటారు. (1)నారన సూరనకృతి ఉదయనోదయమనే ప్రబంధాన్ని పరిష్కరించి ముద్రిస్తున్నారు ఈ ప్రబంధం తాళపత్ర ప్రతి తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరిలో ఒక్కగానొక్కటే ఉంది అది తప్పుల తడక— అంతే లేఖక ప్రమాద భరితం వాటికి తోడు ప్రక్షిప్తాలు, గ్రంథ పాఠాలు కొకొల్లలు. అలాంటిదాని పరిష్కరణ సామాన్యమయిందికాదు (2) సామవేద రాణాయనీయశాఖను సమర్థులైన వేదపండితుల సాహాయ్యంతో నాగరి లిపిలో ముద్రించే ప్రయత్నం చేస్తున్నార (3)శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య లిఖిత పుస్తక పరిశోధక సంస్థ నుంచి సంపాదించిన వరదస్తు వేంకట రంగనాథాచార్యుల 'సంస్కృత లఘుశబ్దార్థ సర్వస్వం ముద్రించేందుకు తీవ్రంగా కృషి చేస్తున్నారు. ఇది పంద సంపుటాలలో ఉన్న లక్షపుటల మహా గ్రంథం. (4) శ్రీ రావూరి దొరస్వామిశర్మ పీఠికా పరిష్కరణలతోఉన్న వెల్లంకి తాతంభట్టు 'కవి చింతామణి' ముద్రణలో ఉంది (5) అనేక తెలుగు హిందీ గ్రంథాల ముద్రణయత్నం చేస్తున్నారు. (6) డాక్టరేటుకు కొందరు విద్యార్థులను సిద్ధపరుస్తున్నారు. (7) గ్రంథాలయంలో ఉన్న 14 భాషల 22వేల లిఖిత ప్రతులకు వర్ణనాత్మక సూచి సిద్ధం చేసే పని నిర్విరామంగా జరుగుతున్నది సంస్కృతాంధ్ర లిఖిత గ్రంథాల సూచికలు సిద్ధంగా ఉన్నవి (8) లిఖిత పుస్తకాలను ఆధునిక సాంకేతిక పద్ధతుల లో పరిరక్షణ చేసే పని జరుగుతున్నది (9) ప్రాచీన లిఖితగ్రంథాలనే కాక ఆధునిక లిఖిత ప్రతులనుగూడా గ్రంథాలయంలో ఒక శాఖగా రూపొందించాలని శ్రీ నరసింహారావు వేదన

నరసింహారావుకు ఈ తపన ప్రాచ్య లిఖిత గ్రంథాలయ, పరిశోధనశాఖల సంచాలక (డైరెక్టరు) పదవి వల్ల కలిగిందికాదు సాహిత్యమన్నా, సారస్వత పరిశోధనమన్నా చిన్ననాటి నుంచి తపన, ఆవేదన ఈయనకు ఉన్నాయి.కనుకనే పలువురు పండితుల వద్ద— శ్రీవేదూరి గోవిందాచార్యులు, శ్రీ గోసుగుంట రామయ్య. శ్రీపళ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులు వంటివారివద్ద—సంగీత సంస్కృతశిక్షణపొందారు మద్రాసు ప్రెసిడెన్సి కళాశాలలో శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు వద్ద ఆంధ్ర సాహిత్యంలో శిక్షణ పొంది ఎం ఎ అయ్యారు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో డాక్టర్ జి. ఎన్ రెడ్డి పర్యవేక్షణ క్రింద 'నన్నయకవిత—అక్షర రమ్యత' అనే విషయముపై సిద్ధాంతవ్యాసంసమర్పించి డాక్టరేట్ పొందారు. ముద్రణ కళలో అభినివేశంతో 'తెలుగు లైనో' బోర్డు' రూపొందించడంలో కృషిచేశారు. సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలోరచనలు వెలయించారు. ఆనంద భిక్షువు,పద్యకావ్యం ప్రతిమ— భాసకృతికి తెలుగు, వినరాసుమతీ—సుమతీ శతకానికి సుజనరంజనీ వ్యాఖ్య. మనుచరిత్ర తత్త్వం—విమర్శ రేడియోకథలు, వ్యాసాలు, బాల సాహిత్యం. సాహిత్య వ్యాసాలు— విమర్శ ధర్మవీరులు— నాటకం రాగబంధాలు— నవల ఇంకా ఎన్నో వ్యాసాలు, కథలు, నాటికలు, పీఠికలు నరసింహారావు సాహిత్య సేవను రాష్ట్ర ప్రభుత్వం గుర్తించి నవరత్నఖచిత సువర్ణ కంకణాన్ని1977అక్టోబరు21న బహూకరించింది ఈయన 1954 నుంచి 1979 వరకు ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో ఆంధ్రోపన్యాసకుడుగాను, తర్వాత 81 మార్చి వరకు ప్రిన్సిపాలుగానుఉండి ప్రస్తుతం ప్రాచ్య లిఖితగ్రంథాలయం డైరెక్టరుగా ఉన్నారు ఈయన1930లో గుంటూరు జిల్లా చేబ్రోలులో జన్మించారు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో వివిధ భాషల అపూర్వ గ్రంథాలున్నవి వాటిని సమర్థులైనపండితులతో పరిష్కరింపచేసి, ప్రచురించి, విజ్ఞానసంపంచిపెట్టి ధన్యులయ్యే అవకాశాన్ని నరసింహారావు పూర్తిగా వినియోగించుకోవాలని, గ్రంథాలయం కీర్తిని ఇనుమడింపజేయాలని కోరుతున్నారు. భగవంతుడు ఆయన తపనను తీవ్రతరం చేయుగాక!

**తెలుగు వెలుగు — కవి 'సమ్మేళనం .**

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం రాష్ట్రావతరణ మహోత్సవం సందర్భంగా తెలుగు వెలుగు ప్రత్యేక కవి సమ్మేళన కార్యక్రమం అక్టోబర్ 25 ఉదయం రవీంద్రభారతిలో నిర్వహించింది. డాక్టరు దాశరథి అధ్యక్షత వహించారు శ్రీయుతులు పురిపండా అప్పలస్వామి, ఆరుద్ర, బాపురెడ్డి, బోయి భీమన్న, కొలకలూరి ఇనాక్, గులాం యాసీన్, నాయని కృష్ణకుమారి, వాసలి వెంక లక్ష్మీ నరసింహారావు, పుటపర్తి నారాయణాచార్యులు, ముకురాల రామారెడ్డి, శారదా అశోకవర్ధన్,మధునాపంతులసత్యనారాయణశాస్త్రి, ఉత్పలసత్యనారాయణాచార్యులు,గుంటూరు శేషేంద్రశర్మ, వానమామలై వరదాచార్యులు, ముదిగొండ వీరభద్రమూర్తి, అరిపిరాల విశ్వం— 18 మంది పాల్గొన్నారు ఇద్దరు ముగ్గురు తప్ప అందరూ గతవైభవాన్నె కీర్తించారు. స్వాతంత్ర్యం వచ్చి మూడు శతాబ్దాలు గడచిన, ఆంధ్రరాష్ట్ర రజతోత్సవం జరుపుకున్నా మనకవులో షావనిజం పోలేదంటే ఏమనగలం! అక్కడక్కడ ఫ్లాష్‌లో తప్ప కవిత రొడ్డ కొట్టుడు ఫక్కీయే. ఒక్క వాసిలి వారు మాత్రం కొత్త పద్ధతిలో శిల్పులను స్మరించారు.



పాటి శ్రీరాములును పేర్కొన్నారు. కొందరు ఇది వరకటి పద్యాలే చదివారు. ఇక ధర్మ పోరాటం, ఐక్యత, అనైక్యత, సమైక్యతా దీపాన్ని, పవిత్ర నేల, సంస్కృతి వంటి ప్రయోగాలకు కొదవలేదు. వాస్తవానికై వారు తప్ప నవ కాల పరిస్థితులను తడివినవారు లేరు. కొందరి కవిత పాపం ఇంత దూరం ఎందుకు వచ్చారీయన అనేట్లు చేసింది. అన్నిటికన్నా స్టేషన్ డైరెక్టర్ శ్రీ రాజారాం స్వాగత ప్రసంగం బాగుంది. దానినే కొంత లయతో చదివి ఉంటే వచన కవిత అయ్యేది. ఆయన తెలుగు జాతి చరిత్రను కొండను అద్దంలోలాగ చూపారు. తెలుగు వారు ఆవేశపరులుకారు, కవితావేశపరులని చమత్కరించారు. అవును. మరి ఆయన సంస్కారం గొప్పది అయిన సుప్రసిద్ధ వాగ్గేయకారులు శ్రీ మైసూరు వాసుదేవాచార్యుల పౌత్రులు. మాతృ భాష కన్నడమైనా తాతగారివలె తెలుగున్నూ అధ్యయనం చేసినవారు. తమ తాతగారి ఉదంతాలు రెంటిని ఆయనను నేను కలుసుకొన్నప్పుడు చెప్పారు. మైసూరు మహారాజా శ్రీ వాసుదేవాచార్యులన్న పిలిపించి కన్నడంలో కృతులు వ్రాయమని కోరారట. "మహారాజా నాకు ఏ భాషా రాదు మాతృ భాష అయిన కన్నడమూ సరిగా రాదు. త్యాగరాజస్వామి వారి కీర్తనలు సాధన చేయడంవల్ల తెలిసిన తెలుగులో తెలుగు కృతులు రచించాను నాకు తెలిసిన తెలుగు త్యాగరాజుల వారి తెలుగే." అన్నారట వాసుదేవాచార్యులు. మరొక ఉదంతం శ్రీమతి రుక్మిణీ అరండేల్‌కోరికపై వాసుదేవాచార్యులు వాల్మీకి రామాయణం నృత్య నాటికను రచించారు దాని ప్రతిని మొదట తిరుమలేశునికి సమర్పించాలని మద్రాసు కళాక్షేత్రం వారంతా తిరుమలకు వెళ్లారు. కాని సమయం మించినందున దేవాలయ ద్వారాలు మూసి వేశారు. శ్రీమతి అరండేలుకు, తక్కిన బృందానికి ఏమీ తోచలేదు. ఎంతోసేపు వేచి తిరిగి రావడానికి లేవబోయారు. ఇంతలో కల్యాణోత్సవం ఉత్సవర్లు రావడం, దేవాలయం తలుపులు తీయడం ఏక కాలంలో జరిగాయి. వాసుదేవాచార్యులు అప్పుడొక కీర్తన చెప్పారుట ఆనందం పట్టలేక. శ్రీ రాజారాంకు సంగీతంలో మంచి ప్రవేశం ఉంది. ఆయన గొప్ప మార్దంగికులు, మణిమా వలయం, వలయమైన మణీ లాగ సమర్థుడైన పంచాలకునితో సంస్థ రాణకెక్కుతుందనడానికి శ్రీ రాజారాంవంటి వారు గొప్ప తార్కాణం.

**ఉపశ్రుతి :**

చూశారా? మొసళ్ల పెంపకం కోసం ప్రభుత్వం ఎంత శ్రమ పడుతున్నదో!— అన్నారు ఒక వన్య మృగ రక్షణాభిలాషి నాతో. అవును. మన పాలకులకు మొసలికన్నీరు అవసరంగదా. అందుకే ఇంత శ్రద్ధ— అన్నారు పక్కన ఉన్న వారు.

# ★ వంటలు ★

## రవ్వ బోండా

కావలసిన వస్తువులు : రవ్వ — పావు కే. జి., క్యాబేజి — అరపువ్వు, ఉల్లిపాయలు — నాలుగు, అల్లం — ఒక చిన్న ముక్క, జీడిపప్పు — కొంచెం, పోపుపొడి - పావుచెంచా, నెయ్యి — అరకప్పు, జీలకర్ర పొడి — అర స్పూను, ధనియాలపొడి — అరస్పూను, కరివేపాకు రెండు రెమ్మలు, శెనగపిండి — కప్పు, వరిపిండి — కప్పు, ఉప్పు — తగినంత, కారం — తగినంత.

తయారుచేయు విధానం : ముందుగా రవ్వ బాగా జల్లించి కొంచెం నేతిలో దోరగా వేయించి తీసుకోవాలి. కూరలను బాగా కడిగి సన్నగా ముక్కలు చేసుకోవాలి. ఒక వెడల్పు గిన్నెలో నేతినిపోసి స్టవ్‌మీద పెట్టాలి.

ఆ తర్వాత ఉల్లి, అల్లం, పచ్చిమిర్చి ముక్కలు వేసి వేయించాలి. పోపు, జీలకర్ర, ధనియాలపొడి కూడా వేసి ఎర్రగా వేయించి, కూర ముక్కల్ని, కొద్దిగా ఉప్పు వేసి మూత పెట్టాలి.

కూర ముక్కలు బాగా ఉడికిన తర్వాత రవ్వకు తగ్గ నీరు పోసి, ఉప్పువేసి మూత పెట్టాలి. నీరు బాగా మరుగుతుండగా రవ్వను ఉండలు కట్టకుండా పోసి కలపాలి. రవ్వ ఉడికి దించేముందు జీడిపప్పు, కరివేపాకు వేసి కలిపి దించాలి.

శెనగపిండి, వరిపిండి, కలిపి కొద్దిగా ఉప్పు, కారం వేసి జోవి పిండిలాగా కలపాలి. బాణలిలో డాల్డా కాగిన తర్వాత ఉప్మా చిన్న చిన్న వుండలు చేసి జోవిలో ముంచి వేసుకోవాలి. ఎర్రగా వేగిన తర్వాత పళ్ళెంలోకి తీసుకోవాలి. ఈ బోండాలు చాలా రుచిగా వుంటాయి.

— కె. అసదున్నీసా బేగం

## లడ్డులతో బిస్కెట్స్

కావలసిన వస్తువులు : 1 కె. జి. నెయ్యి లేక డాల్డా, ½ కె. జి. మైదా, ½ కె. జి. తయారుచేసిన లడ్డూ పొడి, సరిపడినంత ఉప్పు, చిటికెడు సోడా.

తయారుచేయు విధానము : ముందుగా మైదా జల్లెడ పట్టాలి. కొంచెము మైదా పిండి తీసుకొని వేరుగా ఉంచుకోవాలి (బిస్కట్స్ వత్తడము కోసం). మిగిలిన పిండిలో కరిగించిన డాల్డా, ఉప్పు, సోడా వేసి బాగా కలపాలి. దానిలో నీరుపోసి చపాతీ పిండి మాదిరిగా కలిపి, పెద్ద గోలీల సైజులో ఉండలు చుట్టుకోవాలి. ఆ ఉండలను బిస్కట్ మాదిరిగా గుండ్రముచేసి దానిలో లడ్డుపొడి కొద్దిగా పెట్టి, మరియొక యుండ బిస్కట్ మాదిరిగా చేసి దానిపై పెట్టి, రెండు బిస్కట్ అంచులు కలపాలి. అలా మిగిలినవన్నియు చేయవలయును. బాణలిని స్టవ్‌మీద పెట్టి, దానిలో మిగిలిన డాల్డా అంతా పోసి, డాల్డా కాగిన తరువాత ఈ తయారు చేసుకొన్న బిస్కట్స్‌ను దానిలో వేసి బంగారు రంగు వచ్చేవరకు వేయించవలయును. అవి చాలా రుచిగా యుంటాయి. టిఫిన్సుగా వీటిని వాడుకోవచ్చు. చాలరోజులు ఇవి నిల్వ యుంటాయి.

— పి. మాధవీ ప్రసాద్

## రవ్వ వడ

కావల్సిన వస్తువులు : బొంబాయిరవ్వ — ½ కె. జి., నూనె — ½ కె. జి., ఉల్లిపాయలు — మూడు, పచ్చిమిరపకాయలు — 8, కరివేపాకు, జీలకర్ర — కొంత, ఉప్పు — సరిపడినంత.

తయారుచేయు విధం ; ముందుగా రవ్వను శుభ్రం చేసి ఉంచాలి. ఒక గిన్నెలో గ్లాసు నీరు పోసి పొయ్యిమీద వేడి చెయ్యాలి. నీరు కాగిన తరువాత రవ్వను అందులో వేసి బాగా కలిపి దించుకోవాలి. ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు ముక్కలుగా కోసి రవ్వలో కలపాలి. కరివేపాకు, జీలకర్ర, ఉప్పు కూడా వేసి అంతా కలిసే విధంగా కలపాలి. తరువాత చిన్న చిన్న వుండలుగా చేసి వుంచుకోవాలి. బాణాలియందు నూనె కాగాక ఈ ఉండలని వడమాదిరిగా వత్తి నూనెలో ఎర్రగా వేయించాలి. వేడి వేడిగా తింటే ఎంతో రుచిగా వుంటాయి.

— వి. భాగ్యలక్ష్మి



సంపూర్ణ ఆరోగ్యానికి 3000 ఏండ్లనుంచి ప్రఖ్యాతిపొందిన

# డాబర్ చ్యవనప్రాశ
# కుటుంబ ఆరోగ్యాన్ని నాలుగువిధాలుగా మెరుగుపరుస్తుంది.






సి విటమిను సంపన్నంగా ఉండి తీపి, పులుపుల చక్కటి రుచితో సహజ రూపంలో లభించే మిశ్రమం.

**1. శరీర కణాలను నిత్యం యవ్వనంలో ఉంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ శరీర కణాలు అరిగి, తరిగిపోయే ప్రక్రియ వేగాన్ని తగ్గిస్తుంది.

**2. శరీర రోగ నివారణ శక్తి పెంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ మొత్తం శరీర రోగ నివారణ శక్తి పెంచుతుంది. దగ్గు, రొంప నివారణకు కూడా మంచిది.

**3. చురుకుదనం పెంచుతుంది.**
డాబర్ చ్యవనప్రాశ పిల్లలలో చురుకుదనం పెంచుతుంది, వృద్ధాప్యంలో మానసిక, శారీరక శక్తులను పెంచుతుంది.

**4. జీవకణ నిర్మాణ శక్తి.**
డాబర్ చ్యవనప్రాశ శరీరం సక్రమంగా పెరిగి, దారుఢ్యంగా ఉంచుకోడంలో తోడ్పడుతుంది.

## దేవతల వంటకం
3000 ఏండ్ల క్రితం, చ్యవనుడనే ఋషి తన యవ్వనాన్ని తిరిగి పొందేందుకు, దేవతల వైద్యులు ఆయనను చ్యవనప్రాశ వాడమన్నట్టు చెబుతారు. ప్రపంచంలోని ప్రాచీన టానిక్ అయిన చ్యవనప్రాశను, ఇప్పుడు డాబర్‌వారు ఆధునికంగా, రుచిగా, తయారు చేస్తున్నారు.

ఆరోగ్య సంరక్షణకు ఆయుర్వేద ఔషధం డాబర్ చ్యవనప్రాశ

# డాబర్ చ్యవనప్రాశ

అన్ని మందుల దుకాణాల్లోనూ, కెమిస్టులవద్దా లభిస్తుంది.

5577 Tel

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.